## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బాణ మహాకవి

విరచిత

# చండీ శతకము

(తాత్పర్య సహితము)



పబ్లిషర్స్

భువనవిజయం పబ్లికేషన్స్

"సౌందర్యలహరి"

కస్పావారి వీధి, గవర్నరుపేట

విజయవాడ - 520 002.

# ఉపోద్ఘాతము

ప్రాచీన సంస్కృత మహాకవులలో బాణుడు, మయూరుడు అగ్రగణ్యులు. వారిలో బాణుడు 'కాదంబరి' యను మహాగ్రంథమును వచన రూపముగా రచించెను అతడు చేయని కల్పన, త్రొక్కని త్రోవ లేకపోవుటచే, 'బాణోచ్ఛిష్ట మిదంజగత్' అని లోకములో వాడుకైనది. అట్టి బాణుకు మయూరునివలె వ్రాయదలచినాడన్నచో, మయూరు డెంతటివాడై యుండునో!

మయూరుడు రచించిన పెద్ద గ్రంథము లేవియు కనబడవు. 'సూర్యశతకము' నూరుశ్లోకముల శతకమును మాత్రము చెప్పెను. దానివలె నుండవలెనని బాణుడు చండీశతకమును వ్రాసెను.

ఆ రెండు శతకములను గురించి విచారించుటకుముందు ఆ శతకము లే సందర్భములలో రచించబడెనో, విశేషించి సూర్యశతక మెందుకు వ్రాయబడవలసి వచ్చెనో తెలుసుకొనవలసి యున్నది.

ఈ విషయములో, లోకములోనున్న కథలు గాథలుతప్ప వేరే యాధారములు లేవు. బాణుడు మయూరుడు బావమరదులు. మయూరిని చెల్లెలిని బాణుడి కిచ్చినట్లు యొక వాడుక. మయూరిని కూతురిని బాణున కిచ్చినట్లు మరియొక వాడుక వున్నది. ఒకనాడు బాణుడు, ఆయన భార్య యేకాంత మందుండగా, మయూరుడు హఠాత్తుగా ప్రవేశించి రసభంగము చేసెనని యొక కథ. రెండవది. బాణుని భార్యకు బాణునిపై ఎందుకో కోపమువచ్చెను. ఎంత బ్రతిమాలినను శాంతించలేదు. రాత్రియంతయు అనునయించినను వినదయ్యెను. అంతట బాణుడు—

గత ప్రాయా రాత్రిః కృశతనుశశీ శీర్యత ఇవ
ప్రదీపోయం నిద్రావశముపగతో ఘూర్ణిత ఇవ
ప్రణామాంతో మాన స్త్యజసి న తథాపి క్రుధ మహో.

అని మూడుపాదములు చెప్పి యాలోచించుచుండగా, మయూరుడు.

"కుచప్రత్యాసత్త్యా హృదయమపి తే చండి కఠినమ్"

అని నాల్గవపాదము నందించెను. ఇదియొక కోపకారణము. 'చండి' యన్నమాటకు వేరొక కథ చెప్పెదరు. బాణు డీ నాల్గవచరణమును పూరించి, 'చండి' యనుటకు మారుగా 'సుభ్రు' యనెను. అమిత కోపము కలిగియుండుటచేతను, మీదుమిక్కిలి, కోళ్ళపైబడిన బాణుని తన్నినందునను, 'సుభ్రు' అనుపదము బాగుండలేదని, 'చండి' యని మయూరుడు మార్చెనని, దీనివల్లను ఆమెకు కోపము వచ్చెనట.

మూడవకథ :- మయూరు డొకనాడు ప్రొద్దుననే లేచి, 'నిర్యాతి ప్రియమందిరాత్ రతిపతే స్సాక్షాజ్జయశ్రీ రివ' యన్నట్లు, ప్రియుమందిరమునుండి వచ్చుచున్న ఒక సుందరిని చూచెను. చూచి, ఆమె సౌందర్యమును, ఆమెయున్న స్థితిని ఎనిమిది శ్లోకములలో వర్ణించెను. ఆ యెనిమిది శ్లోకములకు మయూరాష్టకమని పేరు. చిర కాలము దేశాంతరగతు డైనందుననో, మరి యేకారణముచేతనో, ఆ సుందరి బాణుని భార్యయని గుర్తించలేదు. తన నట్లు శృంగారభంగితో వర్ణించినందుల కామెకు మయూరునిపై యాగ్రహము కలిగెను. కారణ మేదైనను కోపము వచ్చుట మాత్రము నిజము. కోపగించి, "కుష్ఠరోగివికమ్ము" అని శపించెను, 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని రోగనివారణకు సూర్యశతకమును చెప్పెను. మరియొక గాథనుబట్టి మయూరుడు రాజదర్శనమునకు వెళ్ళినట్లును, కుష్ఠువాడగుటచేదర్శనము లభించలేదనియు, అంతట నూరుత్రాళ్ళతో ఉట్టి నొకదానిని కట్టి, అందులో కూర్చొని, క్రింద మంటనుచేసి, ఒక్కొక్క శ్లోకము చెప్పి, ఒక్కొక్క త్రాటిని క్రోసివేసెనియు, నూరుశ్లోకములు అయిన తరువాత సూర్యుడు ప్రత్యక్షమైనట్లును, సూర్యుని యనుగ్రహముచే నీరోగుడైనట్లును కలదు.

సూర్యశతకమునుచూచి, దానివలె మరియొక శతకమును రచించవలెనని

బాణునికి కుతూహల ముదయించెను. ఏ దేవత నుద్దేశించి చెప్పుటయాయను విషయ ములో వెదక నక్కరలేక, సూర్యశతక రచనకు కారణభూతురాలెవ్వరో, ఎవరు ఆగ్రహ పరవశముతో, అనునయవిముఖయై, పాదతాడనమును సైతముచేసి చండియని పిలువదగి యుండెనో, అట్టి తన భార్యవృత్తాంతమును మనసునం దుంచుకొని, చండీశతకమును రచించెను. దేవిని స్తుతించి ఇల్లాలి అలుక మాన్పిన వాడయ్యెను.

సూర్యశతకము మనదేశములో ప్రచారములోనున్నది గాని, చండీశతక మున్నదనియే యెరుగరు. పండితులు సైతమెరుగరు. సూర్యశతకమును ఇటాలి యను భాషలోనికి డాక్టర్ కార్లో బారన్ హైమర్ వ్రాసెను. వడ్డాది సుబ్బారాయుడు గారు, ఆకొండి వ్యాసమూర్తిగారు తెనుగులో వ్రాసిరి, శ్రీనాథుడు కాశీఖండములో 7, 8 శ్లోకములను సీసములుగా వ్రాసెను.

నా కీనడుమ కొలంబియా యూనివర్సిటీవారు ఇంగ్లీషులో ప్రచురించిన సంస్కృత గ్రంథము కాకతాళీయముగా లభించెను. దానిలో సూర్యశతకము; చండీశతకము, రెంటియొక్క శ్లోకములు ఇంగ్లీషు అక్షరములలో వ్రాయబడి యుండెను. అంతియకాక మయూరాష్టకము మొదలైన మయూర శ్లోకము లున్నవి. సూర్య శతకమునకు యింగ్లీషులో తాత్పర్యము, చండీశతకమునకు ఆ భాషలోనే తాత్పర్యమును న్యూయార్క్ సిటీకాలేజి లాటిన్ అధ్యాపకులు జార్జ్ పేన్ క్వాకెన్ బాస్ వ్రాసిరి. ఆ ఇంగ్లీషు చండీశతక శ్లోకములే నాకాధారము. ఆ తాత్పర్యమే తెలుగు తాత్పర్యమునకు మూలము. సూర్యశతకమునకు అర్థము.

సూర్యశతకమునకు పూర్వము శతకములున్నవో లేవో చెప్పలేము. ఒక్క విషయమును గురించి ఒక్క పద్యము చెప్పుటయే సామాన్యులకు కష్టము. అట్టిచో, ఒక విషయమును గురించి నూరుశ్లోకములు చెప్పుట ఎంత కష్టమో, కవికి యెంత శక్తి యుండవలెనో చెప్పనక్కరలేదు. కాని, రానురాను శతక రచన చాలా తేలిక

త్రైనది. ఒక్క విషయముమీద నూరుపద్యములు చెప్పుటకు మారుగా, నూరు విష యములను ప్రస్తుతమో అప్రస్తుతమో, చెప్పి, చివరకు మకుటము తగిలించుట పరిపాటియైనది. సూర్యశతక మట్టిదిగాదు. అది యపూర్వమై యద్భుతమైన గ్రంథము. అట్టి సర్వాంగ సౌందర్యముగల రచన కనబడదు.

దీని రచనాపద్ధతి ఇట్లున్నది : ముందు ప్రభావర్ణనము (43 శ్లో), తరువాత సూర్యాశ్వవర్ణన (6 శ్లో), ఆపైన సారథియైన అనూరువర్ణన (12 శ్లో), ఆమీద రథవర్ణన (11 శ్లో), అంతట మండలవర్ణన (8 శ్లో), చివర రవివర్ణన (20 శ్లో), సూర్యోదయ మీక్రమము ననుసరించియేకదా యుండుట! అన్నియు స్రగ్ధర వృత్తములే. ప్రతిశ్లోకమునందును. అనుప్రాసలతో యమకముతో, చాల శ్లోకము లలో శ్లేషతోను, నారికేళపాకముగా నుండును. కొన్ని శ్లోకములలో ఒక్క యక్ష రము 20వి మించియుండును. అట్టివి యీ క్రింది శ్లోకములు.

| | | |
|---|---|---|
| 6 | శీర్ణఘ్రాణాంఘ్రి | ఘ్ర |
| 12 | ప్రాచి | చ |
| 33 | భూత్వాజంభస్య | భ |
| 36 | గంధర్వై | ర్వ |
| 40 | వాచాం | చ |
| 70 | నిస్స్యన్దానాం | న్ద |
| 94 | సాంద్రీద్యుశ్శ్రీ | శ |
| 98 | వగ్రై | గ్ర |

## యమకము - అనుప్రాసలు

38 సాసా    58 పాశానాశాంత    71 చక్రీచక్రార

| | | | | |
|---|---|---|---|---|
| శ్లేష : | దత్తానందాః | 9 | అస్త్రాద్రీ | 42 |
| | యత్కాంతిం | 21 | హేలాలోలం | 7 |
| | నోకల్పా | 23 | ముంచన్ రశ్మీన్ | 53 |
| | నిశ్శేషం | 24 | నోమూర్చాచ్ఛన్న | 60 |
| | భ్రాణశ్శక్తి | 25 | యోక్త్రీభూతా | 64 |
| | జ్యోత్స్నాంశా | 26 | నేత్రాహీనేన | 72 |
| | మీలచ్చక్షుః | 31 | ఉద్యద్యాన | 79 |
| | నిశ్శేషా | 31 | భూమిం | 91 |
| | సంసక్తం | 34 | ప్రాకాలో | 92 |
| | భిన్నం | 35 | యస్పృష్టా | 93 |

ఇవిగాక యితర శబ్దాలంకారములు అర్ధాలంకారములు యెన్నియో కలవు.

## చండీశతకము

సూర్యశతకమునందువలె చండీశతకములో 102 శ్లోకము లున్నవి. 6 శార్దూలములు, మిగిలినవి స్రగ్ధరలు. అందలి విషయము బహుస్వల్పము : పాదముతో దేవి మహిషాసురుని త్రొక్కిచంపుట. దీనినే చిత్ర విచిత్రముగా బాణుడు వర్ణించెను. శ్లోకము లన్నింటిలోను ఆశీస్సులేదు. బ్రహ్మ విష్ణుమహేశ్వరులు, ఇంద్రాది దేవతలు, కంసుడు, కుమారస్వామి, గణపతి, పార్వతీదేవి చెలికత్తెయైన జయ, విజయ. మొదలైనవారు శ్లోకములలో చెప్పబడిరి.

## త్రిమూర్తులు : లోకపాలకులు

4, 8, 9, 15, 19, 21, 23, 24, 28, 29,

34, 35, 36, 38, 42, 52, 56, 57, 60, 62,

64, 65, 66, 68, 69, 73, 78, 80 83. 85,

91, 92, 98, 99, 100, 101.

కంసుడు 25, 45, 54 హిమవంతుడు 10. 58

మేనక 63 సముద్రుడు 84 నృసింహమూర్తి 11

జయ. విజయ 12, 15 19, 21, 32, 33, 38.

శృంగారవర్ణన 27, 37, 49, 71, 72, 72ఏ, 74, 75, 76, 77, 81,82

చండీశతకములో అనుప్రాసలు, యమకములు తక్కువలేవు. శ్లేష రెండు మూడు శ్లోకములలో మాత్ర మున్నది. సూర్యశతకములో కొన్ని శ్లోకములవలె, ఒక్క యక్షరముతో నిర్వహించబడిన వృత్తములులేవు.

సూర్యునికి నూటికిమించి పేళ్ళుండుటచే మయూరుడు, చెప్పినదానిని చెప్పక నూరుశ్లోకములను వ్రాయగలిగెను. బాణునికి అట్టి భాగ్యము లేదు. దున్నపోతుకు మహిషము, లులాయము అని రెండే పేళ్ళు శతకమం దంతట మహిషశబ్దమును వాడవలసిన వాడయ్యెను. చివర శ్లోకములో మాత్రము 'లులాయ'మును వాడెను.

## పోలికలు

సూర్యశతకమును అనుకరించి చండీశతకమును బాణుడు వ్రాసినట్లు అనేక శ్లోకములలో కనబడును. సూర్యశతక మొదటిశ్లోకపు మొదటిపాదములో, ఠ,ధ,స, యక్షరములను మయూరుడు వాడెను వాటినే బాణుడును వాడెను.

జంభారాతిభ కుంభోద్భవమివ
దధతస్సాంద్ర సింధూరరేణుం
మాఖంశీ ర్విభ్రమం భ్రూరధర
విధురతా కేయమస్యాన్యరాగం,

| సూర్య | చండీ |
|---|---|
| 49 | 45 |
| 58 | 23 |
| 71 | 66 |
| 88 | 80 |
| 89 | 6 |
| 99 | 93 |

రెండు శతకములను పోల్చి చూడగా, మయూరుని బాణుడు సమీపించి నాడేమోగాని, మించినవాడు మాత్రము కాడు. వారిద్దరు మేరుపర్వతము, వింధ్య పర్వతములవంటివారు. తక్కువ యెక్కువలు నిర్ణయించుటకు మనబుద్ధులు చాలవు.

బాణ మయూరులను స్మరించి నమస్కరించని కవులు లేరు. ఆదిశంకరులు, బాణ మయూరులు, ఏకకాలపువారు కారేమోనని తోచుచున్నది. అయినను, శంకర విజయములో యీ శ్లోకమున్నది. శాక్తేయుడైన బాణునిచేత సౌరుడైన మయూరుని చేత ఆచార్యస్వామివారు తమ భాష్యశ్రవణము చేయించినారని జెప్పిన యీ శ్లోకము ప్రధాన మల్లనిబర్హణన్యాయ నిదర్శనముగా చెప్పబడినట్లు తోచుచున్నది.

న కథాభి రవంతిషు ప్రసిద్ధాన్
విబుధాన్ బాణ మయూర దండి ముఖ్యాన్
శిధిలీకృత దుర్మతాభిమానాన్

## నిజభాషా శ్రవణోత్సుకాం శృకార॥

అంతటి కోపనయై సత్యభామ యనదగిన బాణుని భార్య పేరు తెలియదు. మయూరుని భార్యకూడా ఎవరో తెలియదు. కాని. ఆయన కుమారుని పేరు 'శంకు' అతడును ప్రతిభావంతుడే యనుటకు శ్లోక మొక్కటి యున్నది. తండ్రిది నారికేళ పాకమైతే కుమారునిది ద్రాక్షపాకము. శృంగారమునకు కూడా తండ్రి స్రగ్ధరలను వ్రాసెను. 'శంకు' శార్దూలములతో సరిపుచ్చుకొనెను.

## శతకములను చదువవలసిన పద్ధతి

లోలోపల చదువుటకంటె బిగ్గరగా చదువుటలో విశేషమున్నది. ధ్వని చెవి కెక్కి మనస్సులోన నాటును. చదువరులదృష్ట్యా పద్యము, అర్థము యీ రెంటిలో పద్యమే ప్రధానము. అర్థమగువరకు వేచియుండుటబట్టి, యీ రోజులలో ఎవ్వరికి ఒక్క పద్యము నోటికిరాదు. విద్యాగ్రహణపద్ధతి యేమనగా, అర్థము కాకుండగనే చిన్నతనములో వల్లెవేయుట. భూమిలో విత్తనము నాటినట్లే. కొంతకాలమునకుగాని పూలు, కాయలు కాయదు. చెప్పేకాదు, మన యాహారము అట్టిదే. ముందు తినుట తరువాత జీర్ణించుకొనుట. జీర్ణితాహారములను (ప్రిడిజెస్టెడ్ ఫుడ్) జీర్ణశక్తిలేని కేవల దుర్బలుల కిత్తురు. అర్థమైనను కాకపోయినను, బిగ్గరగా ధారాళముగా చదివి నచో, వృత్తముయొక్క నడక, శబ్దముల చమత్కారము, ధ్వని, మనసునకు గట్టిగా పట్టును. అప్పుడు అర్థమును తెలుసుకొనవలెనని ఆత్రుతకలుగును. పద్యములను వల్లెవేయుటలో కిటుకు కనిపెట్టిన వారికి, యీ రెండు శతకములు ఒక లెక్కగాదు. కావున, శ్రద్ధాభక్తులతో ఈ రెండు శతకములను బుద్ధిమంతులు చదివి ధన్యులగు దురుగాకయని యాశించుచున్నాము.

## పార్వతీ పరమేశ్వరుల ద్యూతము

విజయే కుశలత్ర్యక్షో
న క్రీడి తు మహామనేన సహాశక్తా

**విజయే కుశలోZస్మి**

**నతు త్ర్యక్షోZక్షద్వయ మిదం పాణౌ॥**

పార్వతి : విజయా (చెలికత్తె) త్ర్యక్షుడు (ముక్కంటి) పాచికల **ఆటలో నిపు**
**లోడు. నే నాయనతో ఆడలేను.**

శివుడు : నేను ఆటలో గట్టివాడనే. అయితే నాకు (త్ర్యక్ష) మూడుపాచికలు
లేవు. చేతిలో రెండే యున్నవి.

**కిం మే దురోదరేణ, ప్రయాతు యది గణపతి ర్నాతేZఖిమతః**

**కః ప్రద్వేషి వినాయక, మహిలోకః కిం నజానాసి॥**

పార్వతి : నాకీ జూదముతో యేమి పని ?

శివుడు : అయితే గణపతిని పంపివేయుము.

పార్వతి : గణపతిమీద యెవరికి ద్వేషము ?

శివుడు : పామునకు గరుడుడంటే భయమని తెలియదా ?
(వినాయకుడంటే గరుత్మంతుడు)

**వసురహితేన క్రీడా, భవతాసహ కిద్నృశీ నఙిహేషి**

**కిం వసుభి ర్నమతో, Zమూన్ సురాసురానేవ పశ్యపుర॥**

పార్వతి : డబ్బులేకుండా ఆట యేమిటి ? సిగ్గులేదా?

శివుడు : వసువులతో యేమిపని? ఇదుగో నీ యెదుటనే నమస్కరించుచున్న
దేవతలు, రాక్షసులు వున్నారుగా ?

(వసువులు : అష్టవసువులు, శివునిగణములలోవారు)

(వసు ; బంగారము)

**చంద్రగ్రహణేన వినా, నాఽస్మిరమే కిం ప్రవర్తయస్యేవమ్**
**దేవ్యై యది రుచితమిదం, నంది న్నాహూయతాం రాహుః॥**

పార్వతి : చంద్రుని పట్టుకోనిదే నాకు సంతోషము లేదు. ఎందుకిట్లు వంకర మాటలు మాట్లాడుతారు ?

శివుడు : నందీ. రాహువుని పిలు. దేవిగారి కిష్టమట.

**హే రాహో శితదంష్ట్రీ భయకృతి. నికటస్థితే రతిః కస్య**
**య దినేచ్ఛసి సంత్యక్తః, సంప్రత్యేవైష హారాహిః॥**

పార్వతి : అయ్యో, వాడికోరలు గలిగి, భయముకొలిపే రాహువు దగ్గర ఉంటే యెవరికి సుఖం.

శివుడు : నా మెడలోవున్న పాము నీ కిష్టములేకపోతే, వెంటనే తీసివేసెదను.
(హారాహి : నాగాభరణము)

**ఆరోపయసి ముధా కిం, నాహమభిజ్ఞా కిల త్వదంకస్య**
**దివ్యం వర్ష సహస్రం, స్థిత్వేతి నయుక్త మభిధాతుమ్॥**

పార్వతి : ఎందుకు మీరు ఊరక వంకరమాటలు మాట్లాడతారు ? మీ (నాగ) ఆభరణముసంగతి ఎవరెత్తారు ?

శివుడు : ఏమిటీ! నా ఒడియే యెరుగవా ? ఎన్ని వేల యుగాలో కూర్చొని ఇట్లు అనుట బాగుండలేదు. (అంక : ఆభరణము, ఒడి)

**ఇత్థం పశుపతి పేశల, పాశక లీలాప్రయుక్త వక్రోక్తేః**
**హర్ష వశ తరళ తారక, మాననమవ్యా ద్భవాన్యా వః॥**

ఈ విధముగా శివుడు వక్రోక్తులాడుచుండగా, పార్వతీదేవి కన్నులు ఆనందముతో ఆడచొచ్చెను. అట్టి భవానిముఖము మిమ్ము రక్షించుగాక.

## మ యూ రా ష్ట క ము

ఏషా కా ప్రస్తుతాంగీ ప్రచలితనయనా హంసలీలావ్రజంతీ
ద్వౌహస్తౌ కుంకుమార్ద్రౌ కనకవిరచిత
... యుమ్ గాంగే గతాసా బహుకుసుమయుతా బద్ధవీణా హసంతీ
తాంబూలం వామహస్తే మదనవశగతా గుహ్యశాలాం ప్రవిష్టా॥

ఏషా కా భుక్తముక్తా ప్రచలితనయనా స్వేదలగ్నాంగవస్త్రా
ప్రత్యూషే యాతి బాలా మృగఇవ చకితా సర్వతశ్శంకయంతీ
కేనేదం వక్త్రపద్మం స్ఫురదధరరసం షట్పదేనైవ పీతం
స్వర్గః కేనాద్యభుక్తో హరనయనహతో మన్మథః కస్య తుష్టః

ఏషా కా స్తనపీనభారకఠినా మధ్యేదరిద్రావతీ
విభ్రాంతా హరిణీ విలోలనయనా సంత్రస్తయూథోగతా
అంతస్స్వేదగజేంద్రగండగళితా సంలీలయాగచ్ఛతి
దృష్ట్వారూపమిదం ప్రియాంగ గహనం వృద్ధోఽపి కామాయ తే

వామేనాఽఽవేష్టయంతీ ప్రవిరళకుసుమం కేశభారం కరేణ
ప్రభ్రష్టం చోత్తరీయం రతిపతిగుణాం మేఖలాం దక్షిణేన
తాంబూలం చోద్వహంతీ వికసితవదనా ముక్తకేశా నరాగా
నిష్క్రాంతా గుహ్యదేశా న్మదనవశగతా మారుతం ప్రార్థయంతీ॥

ఏషా కా నవయౌవనా శశిముఖి కాంతాఽఽపథిగచ్ఛతి
నిద్రావ్యాకులితా విఘూర్ణనయనా సంపక్వబింబాధరా

కేశై ర్వ్యాకులితా నఖై ర్విగళితా దంతైశ్చ ఖండీకృతా
కేనేదం రతిరాక్షసేన రమితా శార్దూలవిక్రీడితా॥

ఏషా కా పరిపూర్ణ చంద్రవదనా గౌరీమృగాక్షీక్షిణీ
లీలా మత్తగజేంద్ర హంసగమనా... ...
నిశ్వాసాధరగంధశీతలముఖే వాచామృదుల్లాసినీ
నశ్లాఘ్యః పురుష స్సజీవతి వరో యస్యప్రియా హీదృశీ॥

ఏషా కా జఘనస్థలీ సులలితా ప్రోన్మత్త కామాధికా
భ్రూభంగం కుటిలం త్వనంగధనుషః ప్రఖ్యం ప్రభాచంద్రవత్
రాకాచంద్రకపోలపంకజముఖీ క్షామోదరీ సుందరీ
వీణాదండమిదం బిభాతి తులితమ్ వేలాద్భుజం గచ్ఛతి॥

ఏషా కా రతిహావభావవిలస చ్చంద్రాననం బిభ్రతీ
గాత్రం చంపకదామగౌరసదృశం పీన స్తనాలంబితా
పద్భ్యాం సంచరతీ ప్రగల్భహరిణీ సంలీలయా స్వేచ్ఛయా
కిం చైషా గగనాంగనా భువితలే సంపాదితా బ్రహ్మణా॥

మ యూ రు ని చా టు వు లు

భూపాలై శ్శశిభాస్కరాన్వయ భువః కేనామనాఽఽసాదితా
భర్తారం పునరేకమేవహి భువ స్త్వం దేవ మన్యామహే
యేనాంగం పరిమృశ్య కుంతలమథాఽఽకృష్య వ్యుదస్యాయతం
చోళం ప్రాప్యచ మధ్యదేశ మధునా కాంచ్యాం కరః పాతితః

సూర్యవంశ చంద్రవంశ రాజు లెందరు లేరు? కాని భూభర్తవు నీవే, అంగదేశమును ఆక్రమించి, కుంతలమును వశపరుచుకొని, చోలమును చెదరకొట్టి మధ్యదేశమునుపొంది కాంచినిచేతితో పట్టుకొంటివి.

**ఆఘ్రాత్వాహత్యమూర్ధ్నా ద్రుత మనుపిబతః ప్రస్నుతం**
**మాతురూధః**
**కించి త్కుబ్జైకజానో రనవరత చలచ్చారు పుచ్ఛస్య ధేనుః**
**ఉత్కర్ణం తర్ణకస్య ప్రియతనయతయా దత్తహుంకారముద్రా**
**విస్రంసన క్షీరధారా లవశబల ముఖస్యాంగమాతృప్తిలేఢి॥**

ఆవుమూడ, కాలువంచి తోక ఆడించుచు, మూతి తల్లిపొదుగులోపెట్టికుమ్మి కుమ్మి పాలుత్రాగుచుండెను. ఆవు తలవంచి, చెవుల నిక్కపొడుచుకొని మూతి నిండా పాలబిందువులుపడ్డ దూడను మనసార నాకుచున్నది.

**ఆఘ్రాయాఘ్రాయగంధం వికృతముఖపుటో దర్శయ**
**న్దంతపంక్తిం**
**ధావన్నున్మత్తనాదో ముహురపి రభసాకృష్టయా పృష్ఠలగ్నః**
**గర్దభ్యాః పాదఘాత ద్విగుణిత మరతప్రీతిరాకృష్టశిశ్నో**
**వేగా దారుహ్య ముహ్యన్నవతరతి ఖరః ఖండితేచ్ఛ శ్చిరాయ॥**

గాడిదల శృంగారం

**సంవ్యానాం శుకపల్లవేషు తరళం వేణీగుణేషుస్థితం**
**మందం కంచుకసంధిషు స్తనతటోత్సంగేషు దీప్తార్చిషం**
**ఆలోక్యత్రిపురావరోధన వధూవర్గస్య ధూమధ్వజం**
**హస్తస్రస్త శరాసనో విజయతే దేవో దయార్ద్రేక్షణః॥**

త్రిపుర సంహారసమయములో, అగ్నిజ్వాలలు అంతఃపుర స్త్రీలను చుట్టుముట్టి పైటచెరగు లంటుకొని, త్రాళ్ళవంటి జడలను ప్రాకి, కుచ్చెళ్ళకు వ్యాపించుచుండగా చూచి, శివుడు ధనుస్సును జారవిడచి, దయతో కన్నుల నీరుక్రమ్ముచుండగా చూచుచుండెను. అట్టి శివునకు జయమగుగాక.

అన్యస్యై నం ప్రతీమం కురు మదనరిపో స్వాంగదానప్రసాదం
నాహం సోఢుం సమర్థాశిరసి సురనదీం నాపి సంధ్యాం ప్రణంతుం
ఇత్యుక్త్వా కోపవిద్ధాం విఘటయితు ముమా మాత్మదేహం
ప్రవృత్తాం
రుంధానః పాతు శంభోః కుచకలశహఠస్పర్శకృష్టో భుజో వః॥

అయ్యా. మీ శరీరములో సగభాగం యింకా ఎవరికైన యిద్దురు. నెత్తిమీద గంగనూ మోయలేను. సంధ్యాదేవికి మొక్కనులేను, అని కోపముతో ఉమ పోవ ప్రయత్నించుచుండగా శివుడు వద్దని చేతితో కౌగిలించుచు వారించెను. అట్టి శంభునిచేయి మిమ్ము రక్షించుగాక.

అస్రస్రోత స్తరంగ భ్రమిషుతరళితా మాంసపంకే లుఠంతః
స్థూలాస్థిగ్రంధిభంగై ర్ధవళ బిసలతా గ్రాసమాకల్పయంతః
భూయాసింహాస్యశౌరే స్స్ఫురదరుణహృదంభోజ సంశ్లేషభాజః
పాయాసు ర్దైత్యవక్షస్థ్సల కుహరసరోరాజహంసా నఖా వః॥

నెత్తుటి సుళ్ళలోను, ఏరులలోను మునుగుతు తేలుతు, మాంసమనే బురదలో పొర్లుచు, పెద్ద ఎముకముక్కలనే తెల్లతామరతూండ్లను కొరుకుచు. గుండెకాయ అనే కమలమును గట్టిగాపట్టి నొక్కుచు, నృసింహాకారుడైన విష్ణువుగోళ్ళు, హిరణ్యకశిపు యొక్క పగిలిన రొమ్ములో, సరస్సులో రాజహంసలవలె నుండును. అట్టి శౌరిగోళ్ళు మిమ్ములను రక్షించుగాక.

సంవిష్టో గ్రామదేవ్యాః కుటఘటిత కుటీకుడ్యకోణైకదేశే
శీతే సంవాతివాయౌ హిమకణిని రణద్దంతపంక్తిద్వయాగ్రః
పాంథః కంథం నిశీథే పరికుథిత జర త్తంతుసంతానగుర్వీం
గ్రీవాపాదాగ్రిజానుగ్రిహణ చటచటత్కర్పటాం ప్రావృణోతి॥

పాంథు డొకడు గ్రామదేవతగుడియైన పూరిపాకలో మూలనొదిగి పడుకొనెను. రాత్రి మంచుకురియుచు, చలిగాలివేయగా దవడలాడుచు పండ్లు చప్పుడుచేయుచు, కంపుకొట్టు మాసికలబొంతను కప్పుకొను చుండెను. కప్పుకొనుటకు ప్రయత్నించినప్పుడల్లా పర్రున చిరుగు చుండెను.

పుణ్యాగ్నౌ పూర్ణవాంఛః ప్రథమ మగణితప్లోషదోషః ప్రదోషే
పాంథస్సుప్త్వా యథేచ్ఛం తదను తనుతృణే ధామని గ్రామదేవ్యాః
ఉత్కంపీ కర్పటార్ధే జరతి పరిజడే చిద్రిణి ఛిన్ననిద్రో
వాతేవాతి ప్రకామం హిమకణిని కణాత్కోణతః కోణమేతి.

(బాణుని శ్లోకము)

పాంథు డొకడు ఒడలు కాలుననే భయముకూడా లేక, ఊరిలో ధర్మార్థము యేర్పరచిన చలిమంటదగ్గర తనివితీర కూర్చుని, రాత్రికాగానే పడకకు గ్రామదేవత ఉండే పాకలోనికి పోయెను. కొంతసేపటికి మంచుకురిసి చలిగాలి ప్రారంభించగా నిద్రాభంగమై, పొడవుచాలని చిల్లులబొంతను కప్పుకొనుచు, మూలమూలల నక్కుచుండెను.

## శంకుని శ్లోకము

దుర్వారాస్స్మరమార్గణాః ప్రియతమో దూరే మనోఽప్యుత్సుకం
గాఢంప్రేమ నవం వయోఽతికఠినాః ప్రాణాః కులం నిర్మలం

**స్త్రీత్వం ధైర్యవిరోధి మన్మథసుహృత్కాలః కృతాంతోఽక్షమి**
**సోఢవ్యా స్సఖి సాంప్రతం కథ మమీ సర్వేఽగ్నయో దుస్సహాః॥**

మన్మథుని బాణములు ఆపరానివి, ప్రియుడు దూరమందున్నాడు. మనస్సు ఉవ్విళ్ళూరుచున్నది. ప్రేమ గాఢము. క్రొత్తవయస్సు, ప్రాణములు అతి కఠినములు. కళంకములేనికులము, ఆడపుట్టువుకు ధైర్యమునకు విరోధము, కాలము మన్మధుని స్నేహితుడు (వసంతము), యముడు ఓర్పులేనివాడు. చెలీ! ఇన్ని చిచ్చుల మధ్య వేగడమెట్లు ?



# శ్రీ చండీ శతకమ్

మాభంక్షీ ర్విభ్రమం భ్రూరధర విధురతా కేయ
మస్యాస్యరాగం
పాణే ప్రాణ్యేవ నాయం కలయసి
కలహశ్రద్ధయా కిం త్రిశూలమ్
ఇత్యుద్యత్కోపకేతూన్ ప్రకృతిమవయవాన్
ప్రాపయంత్యేవ దేవ్యా
న్యస్తోవో మూర్ధ్నిముష్యన్ మరుద
సుహృదసూన్ సంహర న్నంఘ్రిరంహః॥

తా. భ్రూమధ్యను బొమముడివేసి యేల భ్రూవిలాసమును చెడగొట్టెదవు ఓ అధరమా. ఎందుకీ యదరుట! ఓ ముఖమా యెందుకు ఎఱ్ఱబారుట! ఓ హస్తమా యేల త్రిశూలమును ఆడించెదవు! ఈ మహిషాసురుడు ప్రాణములతో లేడు. ఈ విధముగా కోపమును చూపు అవయవములను శాంతపరచుచు దేవి తన పాదమును మహిషాసురుని తలమీద ఉంచెను. అట్టి దేవి పాదము మీ పాపమును పోగొట్టు గాక !

హుంకారే న్యక్కృతోదన్వతి మహతి జితే
శింజితై ర్నూపురస్య
శ్లిష్యచ్ఛృంగక్షతేఽపి క్షరదసృజి
నిజాలక్తకభ్రాంతి భాజి [నహార్ష్ణి

3)

స్కంధే వింధ్యాద్రిబుద్ధ్యా నికషతి
మహిషస్యాఽఽహితోఽసూ
దజ్ఞానాదేవ యస్యాశ్చరణఇతి శివం
సా శివా వః కరోతు॥

తా. మహిషాసురుని రంకెలు సముద్రఘోషను మించినవే యైనను దేవి యొక్క కాలినూపురపు చప్పుడు దానిని ముంచివేసెను. మహిషాసురుని కొమ్ములు పాదమును గ్రుచ్చుకొని కారుచున్న నెత్తురును చూచి లాక్షారసమని భ్రమించెను. రాచుకొనుచున్న మహిషుని మూపున, తెలియక వింధ్యపర్వతమను బుద్ధితో ఆమె పాదము నుంచెను. అంతట మహిషాసురుని ప్రాణములు దేవి తెలియకుండగనే హరించెను. అట్టి శివ మీకు శుభముల నిచ్చుగాక।

జాహ్నవ్యా యా నజాతాఽనునయ
పరహృష్టి ప్తయా క్షాళయంత్యా
నూనం నో నూపురేణ గ్లపితశశిరుచా,
జ్యోత్స్నయా వా నఖానాం
తాం శోభా మాదధానా జయతి
నవ మివాఽలక్తకం పిడయిత్వా
పాదేనైవ క్షిపంతీ మహిష
మసురపాదానని ష్కార్య మార్యా

తా. దేవి కోపము మాన్పుటకు గంగను ప్రవహింపచేసి దేవి పాదములను కడిగినప్పుడు కాంతి, చంద్రకాంతిని మించిన కాంతిగల నూపురమును ధరించినప్పుడుగాని కాలిగోళ్ళ ధావళ్యమువల్లగాని, దేవి పాదమునకు సౌందర్యము రాలేదు. లత్తుకనుపిండి, పిప్పిచేసిన దీగను కాలితో తన్నినట్టు, మహిషాసురుని ప్రాణములను తీసి గాలిలో తన్నినప్పుడే ఆ పాదమునకు శోభ వచ్చెను.

మృత్యోస్తుల్యం త్రిలోకమ్ గ్రసితు
మతిరసాన్ నిస్సృతాఃకింను జిహ్వాఃమానా

కిం వాకృష్ణాంఘ్రిపద్మద్యుతిభి రరుణితా
విష్ణుపద్యాః పదవ్యః
ప్రాప్తాః సంధ్యాః స్మరారేః స్స్వయ
మత నుభి స్త్రస ఇత్యూహ్యా
దేవై ర్దేవీ త్రిశూలాహత మహిషజుషో
రక్తధారా జయంతి

తా. దేవి త్రిశూలము గ్రుచ్చుకొని చచ్చిన మహిషాసురుని దేహము నుండి ప్రవహించుచున్న నెత్తురును చూచి. దేవతలు యీ విధముగా నూహించిరి. ఆశతో మూడు లోకములను ఒక్కమారుగా మ్రింగదలచుకొని యముడు నాలుకలను చాచుచున్నాడా, విష్ణుపాదములయందు పుట్టినగంగ, కృష్ణుని (విష్ణువు) యొక్క పాదము యొక్క యెరుపువల్ల, యెర్రగా ప్రవహించుచున్నదా. లేక శివుని ప్రార్థించగా త్రిసంధ్యలు వాటంతట అవి ప్రత్యక్షమైనవా యని యూహించిరి - అట్టి రక్తధారలు జయము నిచ్చుగాక.

దత్తే దర్పాత్ ప్రహారే సపది
పదభరోత్పిష్టదేహావశిష్టాం
శ్లిష్టాం శృంగస్య కోటిమ్ మహిషసురరిపో
ర్నూపుర గ్రంథిసీమ్ని
ముష్యా ద్వః కల్మషాని వ్యతికరవిరతా
వాదధానః కుమారో
మాతుః ప్రక్షిప్తలీలా కువలయకలికా
కర్ణపూరాదరేణ.

తా॥ మహిషాసురుడు గర్వించి మీదికి వచ్చుచుండగా దేవి, గొప్పదైన తన పాదముతో త్రొక్కి పిండి పిండి చేసెను. వాని కొమ్ముయొక్క కొన దేవి చీలమండకు పట్టుకొనియుండెను. దానిని చూచి, చెవిలో పెట్టుకొనిన కమలపుమొగ్గ

యుదము చేయుచుండగా చెవినుండి జారిపడె నను బుద్ధితో, కుమారస్వామి దానిని తీసి యిచ్చెను. అట్టి కుమారస్వామి మీ పాపమును పోగొట్టుగాక.

శశ్వ ద్విశ్వోపకారప్రకృతి రవికృతి
స్సాఽస్తు శాంత్యై శివా వో
యస్యాః పాదోపశ్యలే త్రిదశపతిరిపు
ర్ధూరదుష్టాశయోఽపి
నాకే ప్రాప ప్రతిష్ఠా మనకృ దభిముఖో
వాదయన్ శృంగకోట్యా
హత్వా కోణేన వీణా మివ
రణితమణిమ్ మండలీం నూపురస్య

తా॥ శివ – మార్పులేనిది. లోకములకు క్షేమము కలుగచేయునదై యున్నది. ఆమె పాదసన్నిధి తాకినంతనే దుర్మార్గుడైన మహిషాసురుడు స్వర్గమునకు పోయెను. ఎందుకనగా. ఎదురుగావచ్చి పోరాడినప్పుడు, కోణముతో వీణ వాయించినట్టు, కొమ్ములతో పొడిచి దేవి కాలినూపురమును మ్రోగునట్లు చేసెను. అట్టి శివ మీకు శుభముల నిచ్చుగాక.

నిష్ఠ్యూతోఽంగుష్ఠకోట్యా నఖశిఖరహతః
పార్ష్ణి నిర్యాతసారో
గర్భే దర్భాగ్రసూచీలఘు రివ గణితో
నోపసర్పన్ సమీపమ్
నాభౌ వక్త్రం ప్రవిష్టాకృతివికృతి
యయా పాదపాతేన కృత్వా
దైత్యాధీశో వినాశం రణభువి గమిత
స్సాఽస్తు దేవీ శ్రియే వః

తా॥ కాలికి గ్రుచ్చుకొన్న దర్భమొనకంటె యెక్కువగా లెక్కచేయ

నక్కరలేని మహిషాసురుని, దేవి తన కాలిబొటన(వ్రేలితో (త్రోసి, గోటిమొనతో కొట్టి, మడమతో త్రొక్కి బలములేనివానిగా చేసెను. వాడు ఈడ్చుకొనుచు తిరిగి వచ్చెను. వచ్చినవానిని, ముఖము బొడ్డులోనికిపోయి ఉండ అగునట్లు తన్ని, యుద్ధభూమిలో చంపెను, అట్టి దేవి మీకు శిరుల నిచ్చుగాక.

(గస్తాశ్వ శ్శష్పలోభా దివ హరితహరే
రక్తపసోఢా న లోష్మా,
స్థాణౌ కండూమ్ వినీయ, (ప్రతిమహిషరుషే
వాంతకోపాంతవర్తి
కృష్ణం పంకం యథేచ్ఛమ్, వరుణ ముపగతో
మజ్జనాయేవ యస్యాః
స్వస్థోZభూ త్పాద మాప్య (హద
మివ మహిష స్సాస్తు దుర్గా (శియే వః

తా॥ గడ్డివలె పచ్చగానుండుటచే సూర్యుని గుర్రములను మహిషుడు నమలి వేసెను. అగ్నియొక్క కాంతిని సహించడు. స్థాణువు (శివుడు)ను రాచుకొని దురదను తీర్చుకొనెను. యముని దున్నను చూచి కోపముతోవలె యమునివద్దకు వచ్చెను. బురదకొరకువలె కృష్ణునివద్దకు పోయెను. వరుణుని (సముద్రము)లోనికి దుముకుటకు (ప్రయత్నించెను. కాని దేవి పాదమనెడి సరస్సును అంటగానే ముక్తుడయ్యెను. అట్టి దుర్గ మీకు సిరుల నిచ్చుగాక.

త్రైలోక్యాతంకశాంత్యై (ప్రవిశతి వివశే
ధాతరి ధ్యానతంద్రీమ్
ఇంద్రాద్యేషు (ద్రవత్సు (ద్రవిణపతిపయః
పాలకాలానలేషు
యే స్పర్శే నైవ పిష్ట్వా మహిష
మతిరుషమ్(తాతవంత స్త్రీలోకమ్

పాంతు త్వాం పంచ చండ్యా శ్చరణనఖనిభే
నాపరే లోకపాలాః

తా॥ వివశుడై బ్రహ్మ, ముల్లోకములను రక్షించుకొరకు, ధ్యానములో మునిగి పోయెను. కుబేరుడు, వరుణుడు, యముడు, అగ్ని ఇంద్రుని వెనుక పరుగెత్తిరి. లోకపాలకు లైదుగురు, దేవియొక్క కాలి ఐదుగోళ్ళయితే, దేవిపాదము మహిషాసురుని చంపుటచేత, లోకపాలకులైరి. అట్టి లోకపాలకులు మిమ్ము రక్షింతురుగాక.

ప్రాలేయోత్పీడపీవ్నామ్ నఖరజనికృతా
మాతపే నాతిపాండుః
పార్వత్యాః పాతు యుష్మాన్ పితు రివ తులి
తాద్రీందసార స్సపాదః
యో ధైర్యా న్మ క్తలీలాసముచిత
పతనాపాతపీతాసురాసి
ర్నో దేవ్యా ఏప వామ శ్చలమహిషతనో
ర్వ్యాకలోకద్విషోZపి.

తా॥ చంద్రులవంటి కాంతిగల గోళ్ళకాంతిచేత దేవిపాదము తెల్లగానుండెను. మంచుమీద నడచుటచేత ఆ గోళ్ళు శుభ్రముగానుండెను. ఆమె పాదము తండ్రియైన హిమవంతునివలె తెల్లగను, బలము గలదిగను ఉండెను. ఆటకొరకై కాక, చంపవలెనని పట్టుదలతో పాదమును మహిషాసురునిమీద మోపెను. మోపి వెంటనే వాని ప్రాణములను హరించెను. మహిషాసురునికి అశుభప్రదమైన పార్వతీదేవి యెడమపాదము మీకు శుభప్రదమై మిమ్ములను రక్షించుగాక.

వక్షోవ్యాజైణ రాజ స్సదశఖి రఖిన
త్యాణిజైః ప్రాక్ సురారేః
పంచైవా స్తం నయామో యువతిచరణజాః
శత్రుమేతే వయం తు

ఇ త్యుత్పన్నాభిమానైర్నఖశశిమణిభి
ర్జ్యోత్స్నయా స్వాంశుమయ్యాః
యాయాః పాదే హతారౌ హసిత
ఇవ హరి స్సాऽస్తు కాళీ శ్రియై వః

తా॥ పూర్వము విష్ణుమూర్తి సింహరూపము దాల్చి హిరణ్యకశిపుని రొమ్ము పదిగోళ్ళతో చీల్చెను. మేమైతే యాడుమనిషి కాలిగోళ్ళు అయినా మహిషుని వధించితిమి. చంద్రకాంతమణులవలె స్వయంప్రకాశములైన కాళి పాదనఖములు విష్ణువును హేళనచేయుచున్నట్లుండెను. అట్టి కాళి మీకు సిరుల నిచ్చుగాక.

రక్తాక్తేऽలక్తక శ్రీ ర్విజయిని విజయే,
నో విరాజ త్యముష్మిన్
హాసో హస్తాగ్రసంవాహన మపి
దళితాద్రీందపారద్విషోऽస్య
త్రాసే నైవాద్య సర్వః ప్రణమతి
కదనే నామ నేతి క్షతారిః
పాదోऽవ్యాచ్చుంబితో వో
రహసివిహసతాత్ర్యంబకే నాంబికేయాః

తా॥ ఓ విజయ (దేవిచెలికత్తె) దేవియొక్క పాదము మహిషాసురుని నెత్తురుతో, లత్తుక అక్కరలేకయే ప్రకాశించుచున్నది. పర్వతములలో శ్రేష్ఠుడైన హిమవంతుని యంతగొప్పదై, మహిషాసురుని సంహరించిన పాదమును, నొప్పి పోవుటకు వ్రేళ్ళతోరుద్దు రాయులు, హాస్యాస్పదమగా నుండును. మహిషాసురుని చంపినందున భయముతో దేవతలందరు నమస్కరించుచున్నారు. అని చెప్పుచు శివుడు అంబిక పాదమును చాటుగా ముద్దుపెట్టుకొనెను. అట్టి యంబికపాదము మిమ్ము రక్షించుగాక.

భంగో న భ్రూలతాయా స్తులిత
బలతయాऽన స్తముస్థాం తు చక్రే

న క్రోధా త్పాదపద్మం మహ
దమృతభుజా ముద్ధృతం శల్య మంతః
వాచాలం నూపురం నో జగ దజని జయమ్
శంస దంసేన పార్ష్ణే
ర్మష్యంత్యాఽసూన్ సురారే స్సమర భువి
యయా పార్వతీ పాతుసావః

తా॥ పార్వతీదేవి యుద్ధభూమిలో మహిషాసురుని మడమక్రింద నలిపి చంపినప్పుడు, తీగవంచి కనుబొమలనేకాక. మహిషాసురుని యెముకలనుగూడ విరచెను. పద్మమువంటి పాదమును కోపంతోనేకాక, దేవతలహృదయశల్యమును కూడా పైకి యెత్తెను. మ్రోగుతున్న కాలినూపురమేకాక, లోకమంతయు దీనిని చేతిస్తుయుచు, పదరుబోతువలె ఆయెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక.

నిర్యన్నానాస్త్ర శస్త్రావళి వలతి
బలం కేవలమ్ దానవానామ్
బ్రూ జిహ్నతే దీర్ఘనిద్రాం ద్విషతి న మహి
షిత్యుచ్యసే ప్రాయ శోఽద్య
అస్త్రీసంభావ్యవీర్యా త్వమసి ఖలు మయా
నైవ మాకారణీయా
కాత్యాయన్యాత్తకేళా వితి హసతి హరే
హ్రీమతీ హం త్వరీ న్వః

తా॥ నానావిధములైన శస్త్రాస్త్రములను ధరించి వచ్చుచున్న రాక్షస సేనలు నిన్ను చూచి భయపడి, ఆయుధములు క్రిందపారవైచి పరుగెత్తుచున్నారు. మహిషుని చంపుటచే నిన్ను యీరోజు మహిషి (భార్య) యని పిలుచుట యుక్తము కాదు. స్త్రీలకు సహజముగానుండని బలపరాక్రమములు కలదానవుగనుక. రా, పో, అనుటకు వీలులేకున్నది. అని యీ విధముగా శివుడు హాస్యముచేయుచుండగా కాత్యాయని సిగ్గుచెందెను. అట్టి కాత్యాయని మీ శత్రువులను సంహరించుగాక.

జాతా కిం తే హరే భీ ర్భవతి మహిషతో
భీ రవశ్యం హరీణామ్
అ ద్యేందో ర్ద్వే కళంకౌ త్యజతి పతిరపాం
ధైర్య మాలోక్య చంద్రం
వాయో కంప్యా స్త్వయాZన్యేనయ
యమ మహిషా దాత్మయుగ్యం యయారో
పిష్టే నష్టం జహాస ద్యుజన మితి జయా
పా స్తు దేవీ శ్రియై వః

తా॥ హరీ! భయపడుచున్నావా? (హరి) గుఱ్ఱములు, దున్నను చూచి భయపడుట యుక్తమే. చంద్రునకు యీనాడు రెండు మచ్చలున్నవి. పారిపోవు చున్న చంద్రుని చూచి వరుణుడు ధైర్యము లేనివాడై పరుగెత్తుచున్నాడు. వాయువా! నీవు ఇతరులను కంపింపచేయవలసినవాడవు. ఓ యమ నీ దున్నను అడ్డము తీయుము. దేవి మహిషాసురుని చంపిన తరువాత, యుద్ధమునుండి పారిపోయిన దేవతలను జయ యీ విధముగా మేలమాడెను. అట్టి దేవి మీకు శుభముల నిచ్చుగాక.

శూలపోర్త్రితా దుపాంతప్లుత మహి మహిషా
దుత్పతంత్యా స్త్రివంత్యాః
వర్త్మ న్యారజ్యమానే సపది మఖభుజామ్
జాతసంధ్యాప్రమోహాః
నృత్యం హాసేన మత్వా విజయమహమహం
మానయామీతి వాదీ
యామా శ్లిష్య ప్రవృత్తః పున రపి
పురభి త్పార్వతీ పాతు సా వః

తా॥ త్రిశూలము గ్రుచ్చుకొని పైకెగసిన మహిషాసురుని నెత్తురు భూలోకమంతటను ప్రవహించుచు, ఆకసముమీదికిని యెగిరి, ఆకాశమును యెఱ్ఱగా చేసెను. శివుడు ఆ యాకసమును చూచి, సంధ్యాకాలమైన దనుభ్రమతో నాట్యమాడ జొచ్చెను. పొరపాటు గ్రహించిన తరువాత, దేవి విజయమహోత్సవమును చేయు చున్నానని చెప్పుచు, పార్వతిని కౌగలించుకొని తిరిగి నృత్యముచేయ ప్రారంభించెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక.

నాకౌకో నాయకాద్యై ర్ద్యువసతిభి రసి
శ్యామధామా ధరిత్రీం
రుంధన్ వర్ధిష్ణువింధ్యాచలచకితమనోవృత్తిభి
ర్వీక్షితో యః
పాదోత్పిష్ట స్స యస్యా మహిషసురరిపు
ర్మూర్ధ్ని పురాంతావలంబీ
లేభే లోలేంద్రనీలోపలశకలతులామ్
స్తాదుమా సా శ్రియే వః

తా. ఇంద్రుడు ముందుగా గల దేవతలను ఆకాశమునుండి క్రిందికి చూడగా, కత్తి రంగువలె నీలముగానున్న మహిషాసురుడు వింధ్యపర్వతమని భ్రాంతి గొలప, వింధ్యపర్వతము మరల పెరుగుచున్నదా యని భయము గొలిపెను. ఉమపాదము క్రింద నలిగి చచ్చిన తరువాత వాడు. దేవి పాదముయొక్క కడియపు అంచుననున్న ఇంద్ర నీలమణివలె కనబడెను. అట్టి యుమ మీకు శుభముల నిచ్చుగాక.

దుర్వారస్య ద్యుధామ్నామ్ మహిషితవపుషో
విద్విషః పాతు యుష్మాన్
పార్వత్యాః ప్రేతపాల స్వపురుషపరుషః
ప్రేషితో Zసౌ పృషత్కః

యః కృత్వా లక్ష్యభేదమ్ హృతభువనభయో
గామ్ విభిద్య ప్రవిష్టః
పాతాళం పక్షపాళీ పవనకృత పత
త్తార్క్ష్యశంకాకులాహిః

తా. దుర్జయుడయిన మహిషాసురుని మీదకు యమదూత యనదగు వాడియైన బాణమును పార్వతీదేవి వదలెను. ఆ బాణము వానిని చంపి. లోకము యొక్క భయమును మాన్పి. పాతాళము చొచ్చెను. ఆ బాణము చివరనుండెడి యీకెలుచేయు చపచెడువల్ల గరుత్మంతుడు వచ్చుచున్నాడని పాములు భయపడ జొచ్చెను. అట్టి పార్వతీదెవి మిమ్ము రక్షించుగాక.

వజ్రం విన్యస్య హారే హరికరగళితం,
కంఠసూత్రే చ చక్రం
కేశాన్ బధ్వాZబ్ధిపాశై ర్ధృతధనదగదా
ప్రాక్ప్రలీనాన్ విహస్య
దేవా నుత్సారణోత్కా కిల మహిషహతౌ
మిలతో హ్రేపయంతీ
హ్రీమత్యా హైమవత్యా విమతి విహతయే
తర్జితా స్తా జ్జయా వః

తా. మహిషాసురుని దేవి హైమవతి చంపిన తరువాత పారిపోయిన దేవతలందరూ రాగా. వారిని పారదోలవలె నన్నట్లుగా జయ, దేవియొక్క ముత్యాలసరములో ఇంద్రుని చేతిలోనుంచి జారిన వజ్రాయుధమును, హారములో చక్రి చేతిలోనుంచి పడిన చక్రమును ఉంచెను. దేవి కేశములను వరుణుని పాశములతో చుట్టెను. కుబేరుని గద చేతిలో పెట్టెను. ఇట్లుచేసి దేవతలకు సిగ్గు గలిగించు చుండగా హైమవతి జయను కోపపడెను. అట్టి జయ మీ యజ్ఞానమును పోగొట్టుగాక.

ఖడ్గే పానీయ మాహ్లాదయతి హి మహిషమ్,
పక్షపాతీ పృషత్కః
శూలే నేశో యశోభా గ్భవతి, పరిలఘు ప్రాస్య
ద్వధార్హేపి దండః
హత్వా హేతీ రితీవాఽఖిహతిబహులిత
ప్రాక్తనాపాటలిమ్నా
పార్ష్ణైవ ప్రోషితాసుమ్ సురరిపు మవతా
త్కుర్వతీ పార్వతీ వః

తా. కత్తిలో నీరు త్రాగి సంతోషించగలిగినది యున్నది. (ధార) బాణము పక్షపాతబుద్ధి గలది. (ప్రక్కనపడు గుణము) శూలముతో చంపినచో శివు డనిపించుకొని కీర్తి సంపాదించును. చంపదగిన వానిని కర్రతో కొట్టిప చాలదు. ఇట్లు తలచి, ఆయుధములను అటుపెట్టి, మడమయొక్క యెరుపు యినుమడించు నట్లుగా నొక్కి చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక.

కృత్వేద్రు క్కర్మ లజ్జాజనన మనశనే శక్ర
మాఽసూ న్విహాసీ
ర్విత్తేశ ప్రాణుకంఠే జహి గద మగదప్యాఽయు
మే వోపయోగః
జాత శ్చక్రి న్విచక్రో దితిజ ఇతి సురాం
స్స్వక్తహేతీన్ బ్రువంత్యా
వ్రీడా మాపాదితారి ర్జయతి విజయయా
నీయమానా భవానీ.

తా. ఓ ఇంద్రా! ఆయుధమును పారవేసి, సిగ్గుపడవలసిన పని చేసితివి. అనశనుడవయితే (వజ్రాయుధము లేనివాడు) అయితివిగాని అనశనుడవు; అన్నము తినకుండా మాత్రము ప్రాణములను పోగొట్టుకొనకుము. ఓ కుబేరా!

నీవు అగదుడవయితివి. ఇక చేయగలిగినది అగదుడవై (వైద్యుడవై) శివుని మెడ నలుపును మాన్పుము. ఓ చక్రీ ! నీవు విచక్రుడవయితివి. మహిషాసురుడు సైన్యము లేనివాడయ్యెను. యుద్ధములో పారిపోయిన దేవతల నీ విధముగా జయ మేలమాడి భవాని సిగ్గుపడునట్లు చేసెను. అట్టి భవానికి జయమగుగాక.

దేవ్యా వో వాంఛితాని చ్ఛలమయమహిషోత్పేష
రోషానుషంగా-
నీతః పాతాళకుక్షిమ్ హృతభువనభయో
భద్రకాళ్యా స్స పాదః
యః ప్రాదక్షిణ్యకాంక్షాపలయితవపుషా
వంద్యమానో ముహూర్తమ్
శేషేణే వేందుకాంతోపలరచిత
మహానూపురాభోగలక్ష్మీః

తా. కపటియయిన మహిషాసురుని కోపముతో దేవి త్రొక్కుటచేత (లోకములు భయము లేనివయ్యెను) దేవి పాదము పాతాళము నంటెను. దేవి పాదమునకు ప్రదక్షిణము చేయు తలపుతో శేషుడు కాలికి చుట్టుకొనెనా యను నట్లుగా కాలి కడియమందున్న చంద్రకాంతమణులు ప్రకాశించెను. అట్టి భద్రకాళి మీ కోర్కెల నిచ్చుగాక.

శూలం తూలం ను గాఢం ప్రహర హర
హృషీకేశ కేశోఽపి వక్ర
శ్చక్రేణాఽకారి కిమ్ మే పవిరవతి న హి
త్వాష్ట్రశత్రో! ద్యురాష్ట్రమ్
పాశాః కేశాఽబ్జనాశా న్యసనల! న లభసే
ఖాతు మి త్యాత్తదర్పమ్
జల్పన్ దేవాన్ దిహాకోరిపు రవధి
ద్యయాపార్శ్వస్తు కాంత్యై శివా వః

తా. శివా ! నీ త్రిశూలము దూదివలె నున్నదేమి. గట్టిగా పొడువుము హృషీకేశ ! నీ చక్రముతో నా వెంట్రుకలు కూడా ఉంగరములు చుట్టుకొన్న ట్లయ్యెను. ఇంద్రా! నీ ఆయుధము నీ దిక్కును (తూర్పు) రక్షించుటలేదు. వరుణా! నీ పాశములు తామరతూండ్లు. అగ్ని ! నీవు కాల్చలేవు. ఇట్లు దేవతలను యెత్తిపొడుచు చుండగా శివ మహిషాసురుని చంపెను. అట్టి శివ మీకు సిరుల నిచ్చుగాక.

శార్ఙ్గిన్! బాణం విముంచ భ్రమసి బలి
రసౌ సంయతః కేన బాణో
గోత్రారే! హన్మ్యహం తే రిపు మమరరిపు
స్త్వేష గోత్రస్య శత్రుః
దైత్యావ్యాపాద్యతాంద్రా గజ ఇవ మహిషో
హన్యతే మన్మహేZద్యే
త్యుత్రాస్య సోమా పురస్తాదను దనుజతనుమ్
మృద్నతీ త్రాయతాం వః

తా. శార్ఙ్గి ! (విష్ణుమూర్తి) నీ బాణమును ప్రయోగించుము. మహిషాసురుడు. బలి యనుకొంటివా ! బాణమునేల వెనుకకు లాగియుంచితివి? గోత్రారి! (ఇంద్రుడు) నీ విరోధిని చంపుచున్నాను. వీడు గోత్రములను (కులము) నాశనము చేయువాడు. దైత్యులారా! యీనాడు నా పండుగకై; పోతుమేకవలె దున్న నరక బడనున్నది. త్వరగా నపకుడు. ఇట్లు ఉమ దేవతలను ముందు హేళనచేసి తరువాత మహిషాసురుని చంపెలు. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక.

స్పర్ధావర్ధితవింధ్యభూధరఖరవ్యస్తా
ద్విహాయ స్తలమ్
హస్తా దుత్పతితా ప్రసాదయతు వః
కృత్యాని కాత్యాయనీ

యాం శూలా మివ దేవదారుఘటితామ్
స్కంధేన మోహాంధ ధీ
ర్వధ్యోద్దేశ మశేషబాంధవకులధ్వంసాయ
కంసోఽనయత్

తా॥ వసుదేవుని వంశమును నాశనము చేయుటకు కాత్యాయనిని వధ్య శిలపద్దకు దేవదారు చెక్కతో చేసిన శూలమును భుజముమీద వైచుకొని కంసుడు పోవుచుండెను. హిమవంతుని యెంత యెత్తుగా ఉండవలెనని పెరుగుచున్న వింధ్య పర్వతిమో యనునట్లు పెరిగి, యా బరువుతో కంసుని చేతిని అణచివైచి కాత్యాయని పై కెగిరిపోయెను. అట్టి కాత్యాయని మీ కృషికి ఫలమొసగును గాక!

తూర్ణం తోషత్తురాషట్ప్రభృతిషు
శమితే శాత్రవే స్తోత్రకృత్సు
క్లాంతే వోపేత్య పత్యుస్తతభుజయుగలవ్యాల
మాలంబనాయు
దేహార్ధే గేహబుద్ధిమ్ ప్రతివిహితవతీ
లజ్జయాఽఽలీయ కాళీ
కృచ్ఛ్రం వోఽనిచ్ఛయైవాఽపతితఘనతరాశ్లేష
సౌఖ్యా విహంతు

తా॥ మహిషాసుర మర్దనమైన వెంటనే యింద్రాది దేవతలు స్తోత్రములు చేయుచుండగా, దెవి విసిగి చాచియున్న శివుని చేతులలోనికి పరుగెత్తెను. (అక్కడకును వెంటబడుదురేమోనని) ఆమె యిల్లు వారికి తెలియకుండా నుండవలెనని తలంపుతోవలె. శివుని శరీరములో సగమై, సిగ్గుతో గట్టిగా కలసుకొనియుండెను. అట్టి కాళి మీ కష్టములను పారదోలుగాక.

అప్తాం ముగ్ధేఽర్ధచంద్రః క్షిప సురసరితమ్
యా సపత్నీ భవత్యాః

క్రీడా ద్యూరాజ్యమ్ విముంచాZపర మల మము
సై కేన మే పాశకేన
శూలం ప్రాగేవ భగ్నం శిరసి యదబలా
యుధ్య సేZవ్యా ద్వివదగ్ధమ్
సో త్ప్రాసాలాపత్తై రితి దనుజ ముమా
నిర్దహంతీ దృశా వః

తా॥ ఓ ముగ్ధురాలా! అర్ధ చంద్ర బాణమును వేయుటమాని నీ సవతి యయిన గంగను వినరుము. (పాచికల) ఆట రెండు పాశములతో ఆడవలెను. రెండవ దానిని కూడా వేయుము. నీ త్రిశూలము వేయనక్కరలేదు. ఆడుదానితో యుద్ధము చేయవలసినందుకు నా తలలో శూల మిదివరకే యేర్పడెను. చమత్కార ముగా మాట్లాడుచూ అపహసించుచున్న మహిషాసురుని ఉమ కంటిమంటతో కాల్చి చంపెను. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక !

వక్త్రాణాం విక్లవః కిమ్ వహసి బత రుచమ్ స్కంద!
షణ్ణాం విషణ్ణామ్
సీన్యాః షణ్మాతర స్తే భవ సకల
స్త్వమ్ శరీరార్ధ లబ్ధ్యా
జిహ్మమ్ హన్మ్యద్య కాళీ మితి సమ
మనుభిః కంఠతో నిర్గతా గీర్
గీర్వాణారే ర్యయేచ్ఛామృదుపదమృదిత
స్యాZద్రిజా సాZవతా ద్వః

తా॥ కుమారస్వామీ! ఎందుకు ముఖము లారు వాల్చుకొని దిగులుపడుచున్నావు. నీ కితర తల్లులు ఆరుగురున్నారు. శివా! నీవు పూర్ణశరీరు డవు కమ్ము! ఇదుగో కాళిని యెప్పుడే చంపుచున్నాము! పార్వతీదేవి మృదువయిన పాదముతో విలాసముగా త్రొక్కగానే మహిషాసురునికి ఆ మాటలతోపాటు ప్రాణ ములు కూడా బయటకు వచ్చెను! అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

గాహస్వ వోమమార్గమ్ గతమహిషభయై

ర్వాహ్రిభ్న! విస్రబ్ధ మశ్వైః

శృంగాభ్యాం విశ్వకర్మన్నటయసి న నవమ్

శార్ఙ్గిణ శ్శార్ఙ్గమన్యత్

ఖట్వాంగం త్వజ్జిష్ఠ రోయమ్ బిభృహి మ్రుదు

మిమా మీశ్వరే త్యట్టహాసా

గౌరీ వోఽవ్యాత్ క్షతారి స్స్వచరణగరిమగ్రి స్త

గీర్వాణగర్వా

తా॥ ఓ సూర్యుడా ; యిక ధైర్యముతో ఆకాశమార్గ మంతటను తిరుగుము. నీ గుర్రములకు మహిష భయములేదు.

ఓ బ్రహ్మ ! శార్జీకి, మహిషాసురుని కొమ్ములతో కొత్త ధనుస్సు చేయుచున్నావా? లేదా?

ఓ శివా ! గరుకై గుచ్చుకొను యేనుగుచర్మ మేల ధరించెదవు. ఈ మెత్తని చర్మమును కట్టుకొనుము. గౌరి యిట్లు చులకనగా మాట్లాడుచూ దేవతల గర్వమడచి మహిషాసురుని కాలితో త్రొక్కి చంపెను. అట్టి గౌరి మిమ్ము రక్షించుగాక !

క్షిప్తో బాణః కృత స్తే త్రిశ, వినతితతో

నిర్వ్యళీ ర్మధ్యదేశః

ప్రహ్రాదో నూపురస్య క్షతరిపుశిరసః

పాదపాతైర్ద్విశోఽగాత్

సంగ్రామే సంనతాంగి వ్యధయసి మహిషమ్

నైక మన్యా నపి త్వమ్

యే యుధ్యంతేZత్రి నైవేత్యవతు
పతిపరిహాస హృష్టా శివా వః

తా॥ చాపము బాగాలాగి బాణము వేయగా పొట్లమీదమన్న మూడు ముడతలు వళులు పోయినవి. మహిషాసురుని నెత్తిమీద పాదముతో త్రొక్కుచున్నందున నూపురము యొక్క చప్పుడు ప్రహ్లాదము (శబ్దము) దిక్కులకు వ్యాపించెను. వంగిన దేహముగల చండీ! యుద్ధములో మహిషాసురుని ఒక్కనినే గాదు నీవు చంపినది, అక్కడ లేనివారిని కూడా చంపితివి. శివుడిట్లు చమత్కారముగా మాట్లాడుచుండగా విని శివ సంతోషించెను. అట్టి శివ మిమ్ము రక్షించుగాక! (బాణుడు. బలి, ప్రహ్లాదుడు అని ముగ్గురు రాక్షసులు. బాణశబ్దము బాణమునకును బాణునకును చెందును. వళీ లేక వలి అను శబ్దము వ కు బ కు భేదము లేదుగనుక బలియగును! ప్రహ్లాదశబ్దము చప్పునకును ప్రహ్లాదునికిని వర్తించును! ఫలితార్థమేమంటె యెదుటనున్న మహిషాసురుని చంపినప్పుడు ఎదుటలేని బాణుని, బలిని, ప్రహ్లాదుని కూడా చంపెను అని! మొదటి పాదమునకు మరియొక యర్థముకూడా సాధించవచ్చు! బాణాసురుని చంపగానే అ ఇ మ్ అను మూడు శబ్దములకు [త్రికము] నమ్రులైనుతి చేయుచున్న మధ్యమ లోకవాసులు బలియొక్క బాధనుండి విముక్తులయిరి.

మేరో మే రౌద్రిశృంగక్షతవపుషి రుషో
నైవ నీతా నదీనామ్
భర్తారో రిక్తతామ్యత్తదపి హిత ముఖా
న్నిస్నవత్నోZత్ర కోZపి
ఏతా నో మృష్యతే యన్మహిష
కలుషితా స్వర్ధునీ మూర్ధ్నిమాన్యా
శంభో ర్భింద్యా ద్దసంతీ పతిమితి
శమితారాతిరీతి రుమా వః

తా॥ మేరుపర్వతము కొమ్ములతో పొడవబడి మొక్కపోయినప్పుమి నాకు కోపము రాలేదు! నదులకు భర్తయైన సముద్రుడు యెండిపోవునట్లు చేయబడి

నను కోపము రాలేదు! సముద్రము ఎండిపోవుట, నిస్సపత్నుడగును గనుక ఒకరికి [శివునికి] యిష్టమే! శివుని తలపైనున్న పూజ్యురాలయిన గంగను కలుషమగునట్లు చేయుట మాత్రము సహించను! ఇట్లని శివుని యెత్తిపొడుచుచూ ఉమ మహిషాసురుని చంపెను! అట్టి ఉమ మీ దుఃఖమును పోగొట్టుగాక!

సద్యశ్శాన్థితపాథ్య ముద్ధృతవతీ
శూలం శివా పాతు వః
పాదగ్రాంతవిషక్త ఏవ మహిషాకారే సురద్వేషిణి
దిష్ట్యా దేవ వృషధ్వజో యది భవా
నేషాzపి న స్వామినీ
సంజాతా మహిషధ్వజేతి జయయా కేళౌ
కృతేzర్ధస్మితా

తా॥ శూలపుపోటుకు చచ్చిపడియున్న మహిషాసురుని దేహము నుండి శూలమును లాగుచు, వానిపై పాదాగ్రమును శివ మోపియుండగా చూచి జయ శివుని చూచి అయ్యా! మీకు యెద్దు వాహనమైతే అమ్మగారికి దున్నపోతు వాహనము వచ్చినదని హాస్యమాడెను! అట్టి శివ మిమ్ము రక్షించుగాక!

ఆహంతుం నీయమానా
భరవిధుర భుజ స్రంసమానోభయాంసమ్
కంసే నైవాంసి పావో హరతు హరియశోరక్షణాయ
క్షమాzపి
ప్రాక్ ప్రాణా నస్య నాzzస్యద్గగన
ముదపత ద్గోచరం యా శిలాయాః
సంప్రాప్యాzzగామి వింధ్యాచలశిఖరశిలావాస
యోగోద్య తేవ॥

తా. బరువుచేత వంగిన భుజములపై కంసుడు చంపుటకు మోసుకొని

పోవుచుండగా క్షమ విష్ణుమూర్తి పరాక్రమమును కాపాడదగిన దయ్యును కంసుని చంపక విడిచెను. కంసుడు రాతిమీద కొట్టగానే ఆకాసమున కెగిరెను. ఆ మొగు రుట కాటోవు పుట్టిల్లు అయిన వింధ్యపర్వత శిఖరమును స్మరించుచున్నదా యన్న ట్లుండెను. అట్టి క్షమ మీ పాపములను పోగొట్టుగాక!

సామ్నా నామ్నాయయోనే ర్ధృతి మకృత హరే
ర్నాపి చక్రేణ భేదాత్
సేంద్ర స్యైరావణ స్యాప్యుపరి కలుషితః
కేవలమ్ దానవృష్ట్యా
దాంతో దండేన మృత్యోర్నచ విఫలయ
తోక్తాభ్యుపాయోహతోఽరి
ర్యై నోపాయ స్సపాద స్సుఖయతు భవతః
పంచమ శ్చండికాయాః

తా. మహిషాసురుడు సామోపాయమునకు లోబడడు. (వేదములకు మూలమయిన బ్రహ్మదేవుని సామవేదమును లక్ష్యము సేయడు) భేదబుద్ధి గలవా డగుటచే భేదించు శక్తిగల విష్ణుచక్రమును లక్ష్యము చేయడు. యముని దండము నకు లొంగడు. మదజలము కారినంత విరివిగా ఐరావతము దానముల నిచ్చినప్ప టికి లెక్కచేయడు. ఇట్లు సామ దాన భేద దండోపాయములు వృథాయయ్యెను. కాని అయిదవ ఉపాయమైన చండిక పాదముతో చంపబడెను. అట్టి చండిక మీకు శుభముల నిచ్చుగాక.

భర్తా కర్తా త్రిలోక్యా స్త్రిపురవధకృతీ పశ్యతి
త్ర్యక్ష ఏషా
శ్వ శ్రీ క్వాZZమోధనేచ్ఛా నతు సత్కృశ
మిదమ్ ప్రస్తుతం కిం మయేతి
మత్వా నవ్యాజనవ్యేతరచరణ
చలాంగుష్ఠకోణాభిమృష్టమ్

సద్యో యా లజ్జితేవాసురపతి మవధీ
త్పార్వతీ పాతు సా వః॥

తా. నా భర్తయైన శివుడు ముల్లోకములను సృజించగలవాడును, త్రిపురములను దహించిన వాడును, నన్ను చూచుచున్నాడు. స్త్రీనయిన నాకు యుద్ధము మీద అభిలాష యెందుకు? ఈ పనిని చేయబూనుట బాగుండలేదు. అని యిట్లు పార్వతి సిగ్గుపడుచు (నేల వ్రాయుచుండగా) కదలుచున్న, వాడియైన నయెడమకాలి బొటనవ్రేలు మహిషాసురునకు తగిలి వాడు చచ్చెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

వృద్ధోక్షో న క్షమస్తే భవతు భవ భవద్వాహ
ఏషోఽధు నేతి
క్షిప్తః పాదేన దేవం ప్రతి ఝటితి యయా
కేళికాంతం విహస్య
దంతజ్యోత్స్నావితానై రతనుభి
రతను ర్న్యక్కృతార్ధేందు భాభిః
గౌరో గ్గౌరేవ జాతః క్షణ మివ మహిష
స్సోఽవతా దంబికా వః॥

తా. ఓ శివా! నీ వాహనమైన యెద్దు ముసలిదయినది. ఇదిగో దీనిని తీసుకొనుము అని అంబిక నవ్వుచు కాలితో మహిషాసురుని శివుని వద్దకు తన్నెను అర్ధచంద్రుని కాంతిని తన దంతకాంతితో క్షణము సేపు గారమై (తెల్లనైన) గౌరేవ యెద్దువలెనె అయ్యెను. అట్టి అంబిక మిమ్ము రక్షించుగాక!

ప్రాక్కామం దహతా కృతః పరిభవో
యేన త్రిసంధ్యానతైః
స్తేర్ష్యా వోఽవతు చండికా చరణయో
స్స్వం పాతయంతీ పతిమ్

కుర్వత్యాZభ్యధికం కృతే ప్రతికృతం ముక్తేన
మాళౌ ముహు
ర్బాష్పే ణాZZహితకజ్జలేన లిఖితం న్వం నామ
చంద్రే యయా॥

తా. పూర్వము మన్మథుని కాల్చి చంపినందుకు కోపమువచ్చి త్రిసంధ్యలు కాళ్ళపై బడునట్లుగా శివునిచేత చండిక కాళ్ళకు మ్రొక్కించుకొని కోపము తీర్చుకొనెను. ఇంతటి అధికమయిన శిక్ష విధించినది చాలక ఏడుపు మిషతో కంటకాటుకతో కలసిన కన్నీళ్ళతో (సిరా) చంద్రునిమీద తన పేరును వ్రాసుకొనెను. అట్టి చండిక మిమ్ము రక్షించుగాక!

తుంగాం శృంగాగ్రభూమిమ్ క్షితపతి మరుతాం
ప్రేతకాయే నికాయే
కుంజౌత్సుక్యా ద్విశత్సు శ్రుతికుహరపుటం
ద్రాక్ కకుప్ కుంజరేషు
స్మిత్వా వ స్సంహృతాసో ర్దశనరుచికృతాకాండ
కైలాసభాసః
పాయా త్పృష్ఠాధిరూఢే స్మరముషి మహిష
స్యోచ్చహా సేవ దేవీ॥

తా. చచ్చిపడియున్న మహిషాసురుడు తన దంతకాంతి వల్ల కైలాసము వలె తెల్లగా నుండెను. అదిచూచి భ్రమపడి ఉన్నత ప్రదేశమని దేవతలు విరిగిన కొమ్ముకొనకు పోయిరి, దిగ్గజములు నీడకొరకు వాని చెవిరంధ్రములో దూరెను. ఇవిచూచి చండి ముసిముసి నవ్వు నవ్వెను. కాని శివుడుకూడా కైలాసమనుకొని మూపునెక్కగానే దెవి విరగబడి నవ్వెను. అట్టి దెవి మిమ్ము రక్షించుగాక.

కృత్వా పాతాళపంకే క్షయరయమిళితై
కార్ష్ణవేచ్ఛావగాహమ్

దాహా న్నేత్రత్రయాగ్నే ర్విలయనవిగళచ్ఛృంగ
శూనోత్తమాంగః
క్రీడాక్రోడాఖిశంకం విదధ దపిహితవ్యోమసీమా
మహిమ్నా
వీక్ష్య క్షుణ్ణోయయాఽరి స్తృణ మివ మహిష
స్సాఽవతా దంబికా వః॥

తా, చండియొక్క మూడు క్షేత్రముల నుండి పుట్టిన అగ్నిచేత కరిగి పోయిన కొమ్ములుగల మహిషాసురుడు ప్రళయకాలపు పాతాళపు టడుసులోనికి దుమికెను. ఆదివరాహమా యను శంక కలిగించినట్లుండెను. వాని దేహము ఆకా శము నిండియున్నప్పటికి మహిషాసురుని దేవి గడ్డిపోచవలె అణగద్రొక్కెను. అట్టి అంబిక మిమ్ము రక్షించుగాక।

శూలే శైలావికంపం న నిమిషిత మిషౌ
పట్టిశే పాట్టహాసమ్
ప్రాసే సోత్ప్రాస మవ్యాకుల మపి కులిశే
జాతశంకం న శంకౌ
చక్రేఽవక్రం కృపాణే న కృపణ
మసురారాతిభిః పాత్యమానే
దైత్యం పాదేన దేవీ మహిషితవపుషమ్
పింషతీ వః పునాతు॥

తా॥ దేవతలు మహిషాసురుని మీద ప్రయోగించిన త్రిశూలమునకు కొండవలె కదలకుండెను. బాణములకు కనురెప్ప అయినా లేవలేదు. శూలపు పోటునకు బిగ్గరగా నవ్వెను. ఈటె నపహసించెను. వజ్రాయుధమునకు నొప్పి చెందలేదు. శంకు (మేకు) నకు భయపడలేదు. చక్రమునకు వంగలేదు. కత్తికి

భయపడలేదు. అట్టి మహిషాసురుని చంపిన దేవి కాలిక్రింద నలిపివేసెను. ఆ దేవి మిమ్ములను పవిత్రులుగా చేయుగాక!

చక్రే చక్రస్య నాZక్రామ్యా నచ ఖలు పరశో
ర్నైశిరప్రస్య నాZసే
ర్యద్వక్త్రం కైతవావిష్కృతమహిషతనౌ
విద్విష త్యాజిభాజి
ప్రోతాత్ప్రాసేన మూర్ధ్న స్సఘృణ
మభిముఖాయాతయా కాలరాత్ర్యాః
కల్యాణా న్యాననాబ్జం సృజతు తదసృజో
ధారయా వక్రితం వః॥

తా॥ మహిషాసురుడు వ్రేచిన చక్రమునకు గాని. గొడ్డలికి గాని, బాణమునకు గాని, కత్తికిగాని దేవి ముఖ కమలమునకు యెట్టి మార్పు కలగలేదు. ఆమె ప్రయోగించిన యీటె తలలో గుచ్చుకొని రక్తధారలు ప్రవహించగా చూచి దయను కనబరచెను. అట్టి కాళరాత్రి (చండి) యొక్క ముఖపద్మము మీకు శుభముల నిచ్చుగాక!

హస్తా దుత్పత్య యాంత్యా గగన మగణితా
ధైర్యవీర్యావలేపమ్
వైలక్ష్యేణేవ పాండుద్యుతి మదితిసుతారాతి
మాపాదయంత్యాః
ఉర్వ్యా నల్పాట్టహాసద్విగుణితరసితా
స్సప్తలోకీజనన్యా
స్తర్జన్యా జన్యమాతోః నఖరుచితతయ
స్తర్జయంత్యా జయంతి॥

తా॥ కంసుని పరాక్రమము లెక్కచేయక వాని చేతిలోనుంచి మాయాశకి ఆకాశమున కెగిరెను. కంసుడు సిగ్గు చేతవలె తెల్లబోయెను. ఏడు లోకములకు తల్లియయిన దేవి తన చూపుడు వ్రేలితో కంసుని బెదరించుచుండెను. ఆ వ్రేలి నఖ కాంతిపుంజము గరువపు నవ్వుయొక్క కాంతిచేత యినుమడించెను. ఆ కాంతి పుంజములకు జయము కలుగుగాక!

ప్రాలేయాచలపల్వలై కవిసినీ పాZZర్యాZస్తు
వ శ్చ్రియసే
యస్యాః పాదసరోజసీమ్ని మహిషక్షోభా
త్క ణంవిద్రుతాః
నిష్పిష్టే పతితా త్రివిష్టపరిపా
గీత్యుత్సవోల్లాసినో
లోకా స్సప్త సపక్షపాతమరుతో భ్రాంతిస్మ
ద్భృంగా ఇవ

తా॥ దేవి పాదముయొక్క అంచున యేడులోకములు, కమలము చుట్టును మూగిన తుమ్మెదలవలె నుండును. మహిషాసురుడు కలిగించు క్షోభచేత తుమ్మెదలు చెదరినట్లే సప్తలోకములు చెదరెను. మహిషాసురుడు దేవి కాలికింద నలిగి చావగానే ఏడు లోకములు రెక్కల చప్పుడుతో హుంకారము చేయుచునవి తుమ్మెదలవలె నుండెను. మంచుకొండ యనెడు కొలనులో పుట్టిన ఏకైక కమలమనే చండి మీకు శుభముల నిచ్చుగాక!

అప్రాప్యేషు రుదాసితాసి రశనే రారా
త్కృత శ్శం కుత
స్పత్రపృత్క్రిమకృ త్ప్రరోషపరశు
శ్చ్యాతేన శూన్యో యయా

మృత్యు ర్దైత్యపతేః కృత స్సనదృశః

పాదాంగుళీపర్వతః

పార్వత్యా ప్రతిపాల్యతామ్ త్రిభువనమ్

నిశ్శల్యీ కల్యం తయా॥

తా॥ మహిషాసురుడు బాణము చేతగాని, కత్తిచేతగాని, వజ్రాయుధము చేతగాని, చక్రము చేతగాని, గొడ్డలి చేతగాని, త్రిశూలము చేతగాని సంహరింప బడక పోయినను వాటితో తుల్యమైన దేవియొక్క బొటనవ్రేలి కణుపుతో చంపబడెను. వాని చావుచేత మూడులోకములు సుఖము చెందెను. చండిచేత మూడులోకములు రక్షించబడుగాక!

నష్టా నష్టా గజేంద్రా నపతు వ వసవః కిం

దిశో ద్రా గ్గృహీతాః

శార్ఙ్గిన్ స్సంగ్రామయుక్త్యా లఘు రసి గమిత

స్సోథ తార్క్ష్యేణ తైక్ష్ణ్యమ్

ఉత్ఖాతా నేత్రపంక్తి ర్న తవ సమరతః

పశ్య నశ్యా ద్బలం స్వమ్

స్వారాఖేత్యాత్తదర్పమ్ వ్యామ మసుర

ముమాకుర్వతీ త్రాయతాం వః॥

తా॥ ఓ వసువులారా! అష్టదిగ్గజములను రక్షించ నక్కరలేదు. అవి పారిపోయెను. దిక్కులు శూన్యమై ఆక్రమింపబడెను. యుద్ధమునకు త్వరగా సిద్ధమగు ఓ విష్ణు! నీవు వేగముగా నెగిరి పారిపోవుటకు గరుడుండనే యున్నాడు. యింద్రా! నీ వేయికండ్లు చిల్లులు పడలేదుకదా? నీ సైన్యములు పలాయనమగుచుండగా చూడవేమి? ఈ విధముగా గర్వించి మాట్లాడుచుండగా ఉమ వాని ప్రాణములను తీసెను. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక.

శృత్వాశత్రుం దుహిత్రా నిహత మతిజవో౽ప్యాగ
తో౽హ్నాయ హర్షా
దాశ్లిష్య న్నైచ్ఛలకల్పం మహిష మవనిభృద్బాంధవో
వింధ్యబుధ్యా
యస్యా శ్శ్వేతీకృతే౽స్మిన్ స్మితదశనరుచా
తుల్యరూపో హిమాద్రిర్
ద్రాగ్ద్రాఘీయా నివా౽౽సీ దవతమసనిరాపాయ
పాప్తా దుమా వః॥

తా॥ హిమవంతుడు కదలలేని వాడయినప్పటికి కూతురు మహిషాసురుని సంహరించిన వార్తను విని వేగముతో వచ్చెను. ఆయన బంధువులందరు కొండలే గనుక కొండవలె పడియున్న మహిషాసురుని వింధ్యయని కౌగలించెను. అదిచూచి పార్వతి నవ్వగా ఆమె నవ్వుయొక్క కాంతి మహిషాసురునిపై బడి తెల్లనై యుండగా హిమవంతుడు పెరిగెనా యన్నట్లు కనబడెను. అట్టి ఉమ మీ అజ్ఞానమును పోగొట్టుగాక.

క్షిప్తో౽యం మందరాద్రిః పునరపి భవతా
వేష్ట్యతాం వాసుకే౽బ్ధౌ
ప్రియస్యా౽నేన కిం తే బిసతనుతనుభి
ర్భక్షితై ప్రార్థ్యనాగైః
అష్టాభి ర్దిగ్గజేంద్రైః స్పృహ న హరికరీ
కర్షతీమాం హతే వో
హ్రీమత్యా హైమవత్యా స్త్రీదశరిపుపతే పాం
త్వితి వ్యాహృతాని॥

తా॥ మందరగిరి సముద్రములో తిరిగి పడుచున్నది. వాసుకి! నీవు తిరిగి చుట్టుకొనుము, ఓ గరుడుడా! తామరతూండ్లవలె సన్నని పాముల నేల తినె

దవు? పీనిని తినుము. అష్టదిగ్గజములతో గూడా యింద్రుని యేనుగు, యీ పీను గును లాగలేకున్నది. మహిషాసుర సంహారమైన తరువాత కొంచెపు సిగ్గుతో ఇట్లు మాట్లాడు హైమవతీ మిమ్ము రక్షించుగాక.

ఏషా ప్లోష్టా పురాణామ్ త్రయ మనుహృదురః
పాటనోఽయంనృసింహో
హంతా త్వాష్ట్రిమ్ దుర్యారాష్ట్రాధిపక్షతి
వివిధా స్స్యత్సపేచ్ఛా హృతానామ్
వి(ద్రాణానామ్ విమర్దే దితితనయమయే
నాకలోకేశ్వరాణామ్
అశ్రద్ధేయాని కర్మ ణ్యవతు విదధతీ
పార్వతీ వో హతారిః

తా॥ ఈయనేనా త్రిపురములను దహించినది. ఈయనేనా నృసింహమై విరోధి రొమ్ము చీల్చినది. త్వాష్ట్రిని చంపినది ఈ యింద్రుడేనా? అని పారిపోవు చున్న దేవతలను మహిషాసుర సంహారించినందుకు చేయుచున్న ఉత్సవమునకు అద్భుత కృత్యములు చేసిన పార్వతి పిలిచెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించు గాక.

విద్రాణేంద్రాణి కిమ్ త్వమ్, ద్రవిణదదయితే
పశ్య సంఖ్యామ్ స్వసఖ్యాః
స్వాహే స్వస్థా స్వభర్త ర్యమృతభుజి ముధా
రోహిణీ రోదితీవ
లక్ష్మీ శ్రీవత్సలక్ష్మోరసి వనసి పు రేత్యార్త
మాశ్వాసయంత్యామ్
స్వర్గస్త్రీణామ్ జయాయాం జయతి హతరిపో
ర్హ్రేపితం హైమవత్యాః॥

తా. ఓ యింద్రాణి! ఎందుకు ఆందోళన పడుట? కుబేరభార్య! చూడు మీ స్నేహితురాలేమి చేయునో? స్వాహా! స్వస్థత చెందుము. నీ భర్త హవ్యము భుజించగలడు. రోహిణి! నిష్కారణముగా నేడ్చెదవేల? లక్ష్మి! మరల వెంటనే విష్ణువు రొమ్మున నుండగలవు. ఇట్లు జయ, స్వర్గ స్త్రీల నూరడించుచుండగా యించుక సిగ్గిలిన హైమవతి మహిషాసురుని చంపెను. అట్టి హైమవతి సిగ్గుకు జయము కలుగుగాక!

నిర్వాణః కిం త్వమేకో రణశిరసి శిఖిన్,
శార్జ్గధన్వాఽపి విధ్యం
స్తత్తే ధైర్యం క్వ యాతమ్ జహి హి
జలపతే దీనతాం త్వం నదీనః
శక్రో నో శత్రుభంగే భయపిశున సునాసీర
నాసీరధూళిర్
ధిగ్వ్యాపీ త్యేతి జల్పన్ రిపు రవధి యయా
పార్వతీ పాతు సా వః॥

తా. ఓ అగ్ని! నీ వొక్కడవే వోడిపోతి వనుకుంటివేమో! విష్ణువు కూడా అట్లె యయ్యెను. ఓ వరుణా! నీ ధైర్య మేమైనది. దీనుడవుగావు, నదీనుడవు (నదులకు భర్త) ఓ యింద్రా! నీవు పిరికివాడవు. నీ సేన నడుచుచున్నప్పుడు లేచు దుమ్ము శత్రువు నేమియు చేయలేకున్నది. ఛీ పొండి అని పోటుమాటలు మాట్లాడుచుండగా మహిషాసురుని పార్వతి చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

నంది న్నానందదో మే తవ మురజమృదు
స్సంప్రహారే ప్రహారః
కిం దంతే రోమ్ని రుగ్ద్వే వ్రజసి గజముఖ
త్వం వశీభూత ఏవ

నిఘ్నన్నిఘ్నన్నిదానీం ద్యుజన మిహ మహాకాల
ఏకో౽స్మి నాన్యః
కన్యా౽ద్రే ర్దైత్య మిత్థమ్ ప్రమథపరిభవే
మృద్నతీ త్రాయతాం వః॥

తా. ఓ నందీ! నీ దెబ్బలు మద్దెల దెబ్బలవలె సంతోషము కలిగించు చున్నవి. ఓ గణపతీ! వెంట్రుకపాటి నీ దంతము విరిగిపోయినది. ఎందుకు అటు యిటు తిరిగెదవు? నీవు నా వశమయితివి. నేనే మహాకాలుడను. దేవతలను సంహరించెదను. మహిషాసురుడిట్లు ప్రమధులను తూలనాడుచుండగా పార్వతి వానిని చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

వజ్రం మజ్జో్న మరుత్వా స్నరహరి రురస
శ్శూల మీశ శ్శిరస్తో
దండం తుండా త్కృతాంత స్త్వరితగతి
గదా మస్థితో౽ర్థాధినాథః
ప్రాపజ యత్పాదపిష్టే ద్విషి మహిషవపు
ష్యంగలగ్నాని భూయో౽
ప్యాయూం షివా౽యుధాని ద్యువసతయ ఇతి ప్రా
దుమా పా శ్రియే వః॥

తా. మహిషాసురుని ఉమ చంపిన తరువాత ప్రాణములను రక్షించు కొన్నట్లు దేవతలు వాని దేహములో తగులుకొనియున్న ఆయుధములను దక్కించు కొనిరి. ఎముకలలోని రసమునుండి యింద్రుడు వజ్రాయుధమును, రొమ్మునుండి చక్రి చక్రమును, తలనుంచి శూలమును శివుడు నోటిలోనుండి యముడు దండము మన్నూ. ఎముకలలోనుంచి కుబేరుడు గదను తీసికొనిరి. అట్టి ఉమ మీకు శుభముల నిచ్చుగాక!

దృష్టా వాసక్తదృష్టిః ప్రథమ మివ తథా
సంముఖీనాZZళిముఖ్యే
స్మేరాహాసప్రగల్భే ప్రియవచని కృతప్రోత్ర
పేయాధికోక్తిః
ఉద్యుక్తా నర్మకర్మ ణ్యవతు పశుపతౌ
పూర్వవ త్పార్వతీ వః
కుర్వాణా సర్వ మీష ద్వినిహితచరణాలక్త
కేవ క్షతారిః॥

తా. ఒకరికొకరు యెదుట పడినప్పుడు పశుపతియయిన శివునిమీద కటాక్షదృష్టి, పశుపతియైన మహిషునిమీద క్రోధదృష్టి, శివుడు పరిహాస మాడినప్పుడు నవ్వు, మహిషు డాడినప్పుడు మండిపడుట, శివునితో విలాసముగా విహరించుట, మహిషునితో యుద్ధము చేయుట, శివునియెడ ఆపేక్ష, మహిషుని యెడ నిర్లక్ష్యము; యిట్లుండి పార్వతి మహిషుని చంపి లత్తుక పూసినట్లు నెత్తుటితో యెర్రనయిన పాదము కలదయ్యెను, అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

దైత్యో దోర్దర్పశాలీ నహి మహిషవపుః
కల్పనీయాఽభ్యుపాయో
వాయో వారీశ విష్ణో వృషగమన వృష
కిం విషాదో వృథైవ
బధ్నీత ప్రబధ్నమిశ్రాః కవచ మచకితా
శ్చిత్రభానో దహారీన్
ఏవమ్ దేవాన్ జయోక్తే జయతి
హరరిపో స్త్రాపితం హైమవత్యాః

తా. పరాక్రమశాలియైన మహిషాసురుని యెడ సామాన్యపు ఉపాయములు పనికిరావు. ఓ వాయు, వరుణ, విష్ణు, శివ, ఇంద్రా! ఎందుకు నిరుత్సాహం

లయి యున్నారు? పిరికిపందలవలె నుండక సూర్యునితో గూడా మీరందరు కవచ ములను ధరింపుడు. అగ్నీ! చిత్ర విచిత్రమయిన మంటలతో శత్రువులను దహిం పుము. ఇట్లు జయ పలుకుచుండగా హైమవతి సిగ్గు చెందినదై మహిషాసురుని చంపెను. అట్టి హైమవతి సిగ్గుకు జయము కలుగుగాక!

ఆవ్యోమవ్యాపిసీమ్నాం వన మతి గహనం
గ్రాహమాణో భుజానాం
అర్చి ర్మోక్షేణ మూర్ఛ్ దవదహనరుచాం
లోచనానాం త్రయస్య
యస్యా నిర్మజ్జమజ్జచ్చరణఖరనతో గాం
విభిద్య ప్రవిష్టః
పాతాళం పంకపాతోన్ముఖ ఇవ మహిష
స్త్రాస్యదుమా పా శ్రియే వః॥

తా. ఉమయొక్క బాహువులు. ఆకసమంటు చెట్లుగల అరణ్యమువలె నుండెను. మహిషాసురుడు ప్రవేశించగా మూడు నేత్రములనుండి పుట్టిన మంటలు అరణ్యమునకు మంటపెట్టెను. మహిషుడు మూర్ఛిల్లెను. అంతట దేవి పాదము లతో త్రొక్కగా నిప్పువేడి భరించలేక నీళ్ళలో దుమికినట్లు నేల పగులగొట్టుకొని పాతాళవు టడుసులోనికి పోయెను. అట్టి ఉమ మీకు సిరులనిచ్చుగాక!

సీతే నిర్వ్యాజదీర్ఘా మఘవతి మఘవద్వ
జలజ్జానిదానే
నిద్రాం ద్రాగేవ దేవద్విషి ముషితరుష
స్సంస్మరంత్యా స్స్వభావమ్
దేవ్యా దృగ్భ్యై స్త్రిసృభ్య స్త్రయ ఇవ
గళితా రాశయోర క్తతాయా
స్త్రాశ్యంతామ్ వ స్త్రిశూలక్షతకుహరభువో
లోహితాంభస్సముద్రః

తా. ఇంద్రుని వజ్రాయుధమును కూడా సిగ్గుపరచిన మహిషాసురుని దీర్ఘనిద్ర పోవునట్లు చేసిన వెంటనే దేవికి కోపము చల్లారి ప్రసన్నమాయెను. శూలపుపోటులు తగిలి మూడుగా ప్రవహించుచున్న నెత్తుటి యేరులు దేవి మూడు కండ్లనుండి ప్రసరించుచున్న యెఱ్ఱని కోపమా యన్నట్లుండెను. ఆ రక్తసముద్రము మిమ్ము రక్షించుగాక!

కాళీ కల్పాంతకాలాకుల మవ సకలం
లోక మాలోక్య పూర్వం
పశ్చా చ్ఛ్లిష్టే విషణ్ణే విదితదితిసుతా
లోహితా మత్సరేణ
పాదోత్పిష్టే పరాసౌ నిపతతి మహిషే
ప్రాక్స్వభావేన గౌరీ
గౌరీ వః పాతు పత్యుః ప్రతినయన మివాऽऽవిష్కృ
తాన్యోన్యరూపా॥

తా. దేవి కల్పాంత సమయమునందు లోకముయొక్క వ్యాకులస్థితిని చూచి నల్లగను, (కాళి) తన పాదములను మహిషాసురుడు కొమ్ములతో పొడవ చూచినప్పుడు కోపముతో (లోహిత) యెఱ్ఱగను, చచ్చి పడియున్న మహిషాసురుని చూచి పూర్వమువలె (గౌరి) తెల్లగను ఉండెను. శివుని త్రినేత్రములు దేవి యొక్క మూడు రూపములుగా మారినవా యనునట్లు గౌరి యుండెను. అట్టి గౌరి మిమ్ము రక్షించుగాక!

గమ్యం నాగ్నే ర్న చేంద్రోస్సపది దినకృతామ్
ద్వాదశానామసహ్యామ్
శక్ర ప్రాక్షమ్ సహస్రం సహ సురసదహా
సాదయంతం ప్రసహ్య

ఉత్పాతో గ్రాంధకారాగమ మివ మహిషం
నిఘ్నతీ శర్మ దిశ్యా
ద్దేవీ వో వామపాదాంబురుహనఖమయైః
పంచభి శ్చంద్రమోభిః॥

తా. మహిషాసురుడు అగ్నిచేత గాని, చంద్రుని చేతగాని, ద్వాదశా దిత్యుల చేతగాని జయించుటకు వీలు లేకుండెను. వాడు దేవతా సమూహములను, యింద్రుని పేయికండ్లను నాశనము చేసెను. క్రమ్ముకొని వచ్చుచున్న ఘోరాంధ కారమో యనునట్లుండిన మహిషాసురుని అయిదుగురు చంద్రులనదగిన యెడమ కాలి అయిదు గోళ్ళచేత చంపెను. అట్టి దేవి మీకు సుఖమునిచ్చుగాక!

దత్వా స్థూలాంత్రమాలావళివిఘసహ
ద్ఘస్మరప్రేతకాంతమ్
కాత్యాయన్యాఽఽత్మనైవ త్రిదశరిపు
మహాదైత్యదేహోపహారం
విశ్రాంత్యై పాతు యుష్మాన్ క్షణ ముపరి
ధృతమ్ కేసరిస్కంధభి త్తే
రిష్ఫత్ఖ త్తత్కేసరాళీ మశిముఖరరణన్నూపురం
పాదపద్మమ్॥

తా. కాత్యాయని మహిషాసురుని చంపి వాని కళేబరమును ఆడపిశాచ ములకు ఉపహారముగా నిచ్చెను. తినుటకేదియు లేక ఒక్క ప్రేవులు మాత్రము మిగిలియుండుట చూచి అవి వికటాట్టహాసము చేసెను. తుమ్మెద మోత మోయు చున్న నూపురము గల పాదమును దేవి క్షణము విశ్రాంతి కొరకు గోడవలెనున్న సింహపు వీపున నుంచెను. సింహము జూలు, కాలికి కుచ్చుపెట్టి నట్లుండెను. అట్టి కాత్యాయని పాదపద్మము మిమ్ము రక్షించుగాక!

కోపే నేవారుణత్వమ్ దధ దధికతరాలక్ష్యలా
క్షారసశ్రీః
శ్లిష్యచ్ఛృంగాగ్రకోణక్వణితమణితులాకోటి
హుంకారగర్భః
పత్యాసన్నాత్మమృత్యుప్రతిభయ మసురై
రీక్షితో హంత్వరీన్వః
పాదో దేవ్యాః కృతాంతోఽపర ఇవ మహిష
స్యోపరిష్టా న్నివిష్టః॥

తా. దేవియొక్క పాదము కోపముతో యెఱ్ఱగా నున్నట్లుండి లత్తుక యెరువుతో మరింత యెఱ్ఱగా కనుపించెను. మహిషుని కొమ్ము తగిలి నూపురము కోణముతో వాయించినట్లు శబ్దము చేసెను. దానినిచూచి రాక్షసులు మృత్యువాసన్న మగుచున్నదని భయపడిరి. ఆ కాలిని మహిషాసురుని మీదనుంచగా రెండవ యమునివలె నుండెను. (యముని వాహనము దున్న గనుక) అట్టి దేవిపాదము మీ శత్రువులను సంహరించుగాక!

శస్త్రే శాతత్రిశూలక్షతవపుషి రుషా ప్రేషితే
ప్రేతకాష్ఠామ్
కాళీ కీలాలకుల్యాత్రయ మధికరయం వీక్ష్య
విశ్వాసిత ద్యౌః
త్రిస్రోతా స్త్ర్యంబ కేయమ్ వహతి తవ
కృశేమ్ పశ్యరక్తా విశేషా
న్నో మోర్ధ్నా ధార్యతే కిం హసితపతి రితి
ప్రీతయే కల్పతాం వః॥

తా॥ మహిషాసురుడు త్రిశూలముచే పొడవబడి హతుడయ్యెను. వాని రక్తము మూడు ప్రవాహములుగా పారుచుండగా చండి శివునిచేత మూడుపాయ

లుగా ప్రవహించు గంగ ఎఱ్ఱనయి పారుచున్నది. మీరేల దీనిని మౌళిపై ధరింపరు? అని యనెను. అట్టి కాళి మీకు ప్రీతిని కలిగించుగాక.

శృంగే పశ్వోర్ధ్వదృష్ట్యాఽధికతర మతను స్స
న్నపుష్పాయుధోఽస్మి
వ్యాళాసంగేఽపి నిత్యం న భవతి భవతో భీ ర్న
యజ్ఞోఽస్మి యేన
త్వం ముంచోచ్చైః పినాకిన్ పునరపి విశిఖమ్
దానవానాం పురోఽహమ్
పాయా త్స్రత్వాన పేవం హసితహర ముమా
మృదన్తీ దానవం వః॥

తా॥ నీ పై కన్నును బాగా తెరచి నా కొమ్ములను చూడుము. నేను బలహీనుడను కాను. శరీరము లేనివాడను కాను. పువ్వులు ఆయుధములుగా కలవాడను కాను. నీ బాణములకు భయపడను. నేను యజ్ఞమునుగాను. నీ పాములకు భయపడను. మంత్రముల నెరిగినవాడను కావున నో పినాకీ! నీ బాణమును ఆకసము వైపు వేయుము. నేనే త్రిపురుడను. రాక్షసులకు ముందుండువాడను అని శివుని పరిహసించు మహిషాసురుని ఉమ త్రొక్కి చంపెను. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక.

నందీశోత్సార్యమాణాపసృతి సమనమన్నాకిలోకం
నువత్యా
నప్తుర్హస్తేన హస్తం తదనుగతగతే
షణ్ముఖస్యాఽవలంబ్య
జామాతుర్మాతృముఖ్యోపగమపరిహృతే
దర్శనే శర్మదిశ్యా
న్నేదీయ శ్చుంబ్యమానా మహిషవధమహే మేనయా
మూర్ధ్న్యుమా వః॥

తా॥ మహిషాసుర వధోత్సవము జరుగుచుండెను. నందీశ్వరుడు దేవిని స్తోత్రము చేయుటకు వచ్చిన దేవతలకు త్రోవ చూపుచుండెను. మనుమడైన

కుమారస్వామి చేయి పట్టుకొని ముందు నడువగా మేనక ఆ దేవతలకు నమస్క-రించుచూ వచ్చెను. అత్తగారు వచ్చుచున్నారని శివుడు ప్రక్కగా తిరిగియుండెను. అంతట మేనక కూతురయిన ఉమ శిరమును మూర్కొనెను. అట్టి ఉమ మీకు శుభముల నిచ్చుగాక!

భక్త్యా భృగ్వత్రిముఖ్యై ర్మునిభి రభినుతా
బిభ్రతీ నైవ గర్వం
శర్వాణీ శర్మణే వః ప్రశమిత సకలోపప్లవా
సా సదాస్తు
యా పార్ష్ణి క్షుణశత్రు ర్విగళితకులిశ
ప్రాశపాశత్రిశూలమ్
నాకౌకోలోక మేవ స్వమపి భుజవనం
సంయుగేऽవ స్త్వమంస్త॥

తా॥ విపత్తులను పారదోలు శర్వాణి. భృగు, అత్రి మొదలయిన మహర్షుల చేత నుతించబడిన గర్వమును పొందలేదు. మహిషాసురుని కాలిమడమ క్రింద నలిపి చంపిన తరువాత తన చేతులు, దేవతల చేతులుకూడా వ్యర్థమని తలచెను. కులిశము, ప్రాసము, పాశము, త్రిశూలము దేవి చేతులనుండి క్రిందపడినట్లె. దేవతల చేతులనుంచి కూడా అట్లె పడెను గనుక అట్లు తలచెను. అట్టి శర్వాణి మీకు క్షేమము కలుగచేయుగాక.

చక్రం శౌరేః ప్రతీపం ప్రతిహత మగమ
త్త్వాగ్ద్వ్యథామ్నాం తు పశ్చా
దాప చ్చాపం బలారే ర్న పర మగుణతాం
పూత్రయప్లోషిణోऽపి
శక్త్యాऽలం మామ్ విజేతుం న జగదపి
శిశౌ షణ్ముఖే కా కథేతి
స్మిత్యుకుర్వ న్నాకిలోకం రిపు రవధి
యయా సాऽవతా త్పార్వతీ వః॥

తా॥ మొదట శౌరి చక్రము వెనుకకు తిరిగిపోయెను. తరువాత దేవతల సైన్యము పారిపోయెను. ఇంద్రుని ధనుస్సేగాక త్రిపురహరుడయిన శివుని ధనుస్సుకూడా (గుణము) త్రాడులేనిదాయెను. ప్రపంచము నన్ను జయించలేకపోయెను. ఈ యారుముఖములు గల కుమారుడా నన్ను బల్లెముతో చంపువాడు? ఇట్లు దేవతల నపహసించుచున్న మహిషాసురుని పార్వతి చంపెను, అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక.

విద్రాణే రుద్రవృందే సవితరి తరశే వజ్రిణి
ధ్వ స్తవజ్రే
జాతాశంకే శశాంకే విరమతి మరుతి
త్య క్తవైరే కుబేరే
వైకుంఠే కుంఠితాస్త్రే మహిష మతిరుషమ్
పౌరుషోపఘ్న నిఘ్నం
నిర్విఘ్నం నిఘ్నతీ వ శ్శమయతు దురితం
భూరిభావా భవానీ॥

తా॥ రుద్రులు పారిపోయిరి. సూర్యుడు భయములో వణకజొచ్చెను ఇంద్రుడు వజ్రాయుధమును పారవైచెను. చంద్రుడు భయపడెను. వాయువు ఆగిపోయెను. కుబేరుడు ధైర్యమును కోల్పోయెను. విష్ణువుయొక్క ఆయుధము మొక్కవోయెను. అప్పుడు భవాని అమిత కోపముతో నున్నటువంటిన్ని తన పరాక్రమము మీదనే యాధారపడి నటువంటిన్ని మహిషాసురుని సులభముగా చంపెను. అట్టి భవాని మీ పాపములను పోగొట్టుగాక.

భూషాం భూయ స్తవాऽద్య ద్విగుణతర మహం
దాతు మేవైషలగ్నే
భగ్నే దైత్యేన దర్పా న్మహిషితవపుషా కిం
విషణ్ణే విషణ్ణః
ఇత్యుక్త్వా పాతు మాతు ర్మహిషవధమహే
కుంజరేంద్రాననస్య

న్యస్య న్నాస్యే గుహో వ స్స్మితసితరుచినీ
ద్వేషిణో ద్వే విషాణే॥

తా॥ గణపతీ! మహిషాసురుడు నీ దంతమును విరగగొట్టెనని యెందుకు విచారించుచున్నావు. నీకు నేను రెండింతలు అలంకారయోగ్యమైన దాని నియ్యగలను. అని మహిషాసుర వధోత్సవమునందు పార్వతీదేవి చిరునవ్వు తెలుపుచేత తెల్లనయిన మహిషాసురుని రెండు కొమ్ములను గుహుడు (కుమారస్వామి) గణేశునిమీద వైచెను. అట్టి గుహుడు మిమ్ము రక్షించుగాక.

విశ్రామ్యంతి శ్రమార్తా ఇవ తపసభృత
స్సప్తయ స్సప్తయస్మిన్
సుప్తా స్సప్తాపి లోకా స్తిమిముషి మహిషే
యామినీధామ్ని యత్ర
ధారాణాం రౌధిరీణా మరుణిమని
నభస్సాంద్రసంధ్యాం దధాన
స్తస్య ధ్వంసా త్సుతాZద్రే రపరదినపతిః
పాతు వః పాదపాతైః॥

తా॥ గొప్ప చీకటి క్రమ్మి వస్తువులు గోచరము కాకుండెను. సూర్యుని యేడు గుఱ్ఱములు అలసిపోయి సేద తీర్చుకొనుచున్నవా యన్నట్లున్నవి. ఏడులోకములు నిద్రపోయెను. అంతట సూర్యుడు ఉదయించపోవుచు రక్తధారల వలె యెఱ్ఱవి కాంతిని ప్రసరించెను. ఆ యెఱ్ఱనిరంగు సూర్యుడు సంహరించగా వచ్చిన రాత్రియొక్క నెత్తురా యన్నట్లున్నది. అట్లె గొప్ప చీకటిని పోలిన మహిషాసురుడు జగత్సంహారమును చేయగా సూర్యుని యేడుగుఱ్ఱములు శ్రమచేత విశ్రమించెను. ఏడులోకములు నిద్రపోయెను. అప్పుడు పార్వతి వానిని త్రొక్కి చంపగా యెఱ్ఱని నెత్తురు ప్రవహించెను. రెండవ సూర్యుడా అనదగు పార్వతి మిమ్ము రక్షించుగాక.

దేవారే ర్దానవారే ద్రుత మిహ మహిషచ్ఛద్మనః
పద్మసద్మా

విద్రాతీ త్యత్ర చిత్రం తవ కిమితి భవన్నాభిజాతో
యత స్సః
నాభీతోZభూ స్స్వయం భూ రివ సమరభువి
త్వం తు య ద్విస్మితాZస్మి
త్యుక్త్వా త ద్విస్మితం వః స్మరరిపుమహిషీ
విక్రమేZవ్యాజ్జయాయాః॥

తా॥ దేవియొక్క చెలికత్తె జయ దేవి పరాక్రమమునకు విస్మయము చెంది యిట్లనుచున్నది, ఓ అత్ర; శివ, మహిషాసురుని చూచి బ్రహ్మ పారిపోయి నందు కెందు కాశ్చర్యపడెదవు. బ్రహ్మ నాభిజాతుడు న+అభిజాతుడు. కులీనుడు కాడు. కాని బ్రహ్మవలె నీవును యుద్ధభూమిలో 'నాభీతు'డ వయితివి. (న=అభీత) భయము లేనివాడవు కాకపోతివి. అనగా భయపడి పారిపోతివి, ఆ జయయొక్క విస్మయము మిమ్ము రక్షించుగాక.

నిస్త్రింశే నోచితం తే విశసన మురస శ్ఛిన్ధి
కర్మాZస్య ఘోరమ్
వ్రీడా మస్యోపరి త్వం కురు దృఢహృదయే
ముంచ శస్త్రాణి క్ష్యమూని
ఇత్థం దైత్యై స్సదైన్యం సమద మపి సురై
స్తుల్య మేవోచ్యమానా
రుద్రాణీ దారుణం వో ద్రవయతు
దుఃఖితం దానవం దారయంతీ॥

తా॥ క్రూరురాలా! మహిషుని రొమ్ము చీల్చుట యుక్తముకాదు. ఓ కోప స్వభావురాలా యీ ఘోరకృత్యమును చాలించుము. ఓ కఠిన హృదయురాలా, నీ ఆయుధములను పారవేయుము - అని దైన్యముగా రాక్షసులును, ఓ చండీ మహిషాసురుని రొమ్ము చీల్చుట చాలా యుక్తమయినది, వాని కృత్యములు ఘోర ములు వానిని చంపక విడువచూచుట నీకు సిగ్గుగాదా? ఆయుధములను వానిమీద వేయుము అని సంతోషముగా దేవతలును ఒకే మాటలతో హెచ్చరించిరి. రుద్రాణి వానిని చీల్చివైచెను. అట్టి రుద్రాణి మీ పాపములను పోగొట్టుగాక.

చక్షు ర్దిక్షు క్షిపంత్యా శ్చలితకమలినీ
చారుకోశాభితామ్రమ్
మంద్రధ్వానానుయాతం ఝుటితి వలయినో
ముక్తబాణస్య పాణేః
చక్రాత్యా స్సవ్యాపసవ్యం సురరిపుషు
శరాన్ ప్రేలయంత్యా జయంతి
త్రుట్యంతః పీనభాగే స్తనవలనభరా
త్సంధయః కంచుకస్య॥

తా॥ కదులుచున్న యెర్ర తామరవంటి కాంతిగల కండ్లతో చండి నాలుగుదిక్కుల చూచెను. వెంటనే కంకణములు గల చేతులనుండి బాణములు వేయగా, అవి మంద్ర ధ్వనిచేయుచు పోవుచుండెను. సవ్యాపసవ్యముగా దేవి బాణములను వేయుచుండగా కంచుకము, స్తనతమువద్ద విచ్చిపోయెను, ఆ దేవి కంచుకపు ముళ్ళకు కుట్లకు జయము కలుగుగాక.

బాహూత్క్షేపసముల్లస త్కుచతటం ప్రాంతస్ఫుట
త్కంచుకమ్
గంభీరోదరనాభిమండలగళత్కాంచీ
ధృతార్ధాంశుకమ్
పార్వత్యా మహిషాసురవ్యతికరే
వ్యాయామరమ్యం వపుః
పర్యస్తావధిబంధబంధురలసత్కేశోచ్చయం
పాతు వః

తా. మహిషాసురునితో యుద్ధము చేయునప్పుడు మనోహరముగా నుండెను. కంచుకము అంచులు వదులుటచేత, చేతులెత్తుటచేత కుచము లగుపడు చుండెను. కాంచీధృతమైన సగముచీర నాభిక్రిందకు జారుచుండెను. కాంతితో ప్రకా

శించు కేశపాశములు వీడి మొగమున వ్రాలుచుండెను. అట్టి పార్వతీదేవియొక్క వ్యాయామ రమ్యమైన శరీరము మిమ్ము రక్షించుగాక.

పాదావష్టంభనమ్రీకృతమహిషతనో
రుల్లసద్బాహుమూలమ్
శూలం ప్రోల్లాసయంత్యా స్స్వరశితవపుషో
మధ్యభాగస్య దేవ్యాః
విశ్లిష్టస్పష్టదృష్టోన్నతవిరళబహువ్యక్త
గౌరాంతరాళా
స్త్రిస్రో వః పాంతు రేఖాః క్రమవశ
వికసత్కంచుకప్రాంతముక్తాః॥

తా. త్రిశూలమును త్రిప్పుచు కాలితో మహిషాసురుని గట్టిగా చంపుచుండగా దేవి బాహుమూలమున్నూ, త్రివళలున్నూ ప్రకటితమయ్యెను. త్రివళుల మధ్య తెల్లని దేహకాంతి స్పష్టముగా కనబడుచుండెను. అట్టి దేవిత్రివళులు మిము రక్షించుగాక.

చక్రం చక్రాయుధస్య క్వణతి నిపతితం
రోమణి గ్రావణీవ
స్థాణో ర్బాణశ్చ లేఖే ప్రతిహతి ముఖరా
చర్మణా వర్మణేవ
యస్యేతి క్రోధగర్భా హసహరిహరా
తస్య గీర్వాణశత్రోః
పాయా త్పాదేన మృత్యుం మహిషతనుభృతః
కుర్వతీ పార్వతీ వః॥

తా. చక్రాయుధుని (విష్ణువు) యొక్క చక్రము మహిషాసురుని రోమములకు తగిలి రాతిమీద పడినట్లు చప్పుడు చేయుచుండెను. స్థాణుని (శివుని. బాణము వాని వీపునకు తగిలి కవచమునకు తగిలినట్లు వెనుక కెగురుచుండెను)

యిట్లు హరిహరులను అపహసించుచు కోపముతో దేవి కాలితో మహిషాసురుని చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక.

కృత్వా వక్త్రేందుబింబం చలదలకలసద్భ్రూలతా
చాపభంగం
క్షోభవ్యాలోలతారం స్ఫురదరుణరుచిప్రాంత
పర్యంతచక్షుః
సంధ్యాసేవాపరాద్ధం భవ మివ పురతో
వామపాదాంబుజేన
క్షిప్తం దైత్యం క్షిపంతీ మహిషితవపుషం పార్వతీ
వః పునాతు॥

తా. చంద్రబింబమువంటి ముఖముమీద తీగవలెనున్న బాణముతో పోల్చదగిన కనుబొమలను, కదలుచున్న ఆకువలె త్రిప్పుచు కోపములో కన్నులను త్రిప్పుచు ఎర్రనికాంతులు మెరయుచుండగా సంధ్యకు మ్రొక్కినందుకు కోపముచే శివుని కాలితో తాకినట్లు మహిషాసురుని యెడమకాలితో తాకి చంపెను. అట్టి పార్వతి మిమ్ము పవిత్రులను చేయుగాక!

గంగాసంపర్కదుష్యత్కమలవనసముద్భూత
ధూళీవిచిత్రో
వాంఛాసంపూర్ణ భావాదధికతరరసం తూర్ణ
మాయాత్సమీపం
క్షిప్తః పాదేన దూరం వృషగ ఇవ యయా
వామపాదాభిలాషీ
దేవారిః కైతవావిష్కృదమహిషవపు
స్సావతాదంబికా వః॥

తా॥ గంగాసంపర్కము చేత కలుషితమైన కమలముల పుప్పొడి యనెడి దుమ్ముతో విచిత్రముగా నున్నట్టియు, కోర్కెను తీర్చుకొనుటకు అతి ప్రీతితో దగ్గరకు వచ్చుచున్న శివుని పార్వతీదేవి యెడమకాలితో తాకినట్లు మహిషా

సురుని భద్రకాళి అతి కఠినమైన కాలితో చంపెను. అట్టి భద్రకాళి మిమ్ములను రక్షించుగాక!

భద్రే భ్రూచాప మేత న్నమయసి ను వృథా
విస్ఫురన్నేత్రబాణం
నాఽహం కేళీ రహస్యే ప్రతియువతికృతా
ఖ్యాతిదోషః పినాకీ
దేవీ సోత్ప్రాస మేవం ధృతమహిషతనుం
దృష్ట ముంత స్సకోపం
దేవారిం పాతు యుష్మా నతిపరుషపదా
నిఘ్నతీ భద్రకాళీ॥

తా॥ ఓ చండీ! చాపమువంటి కనుబొమను వంచి బాణములవంటి చూపులతో యేల చూచెదవు? కేళీ సమయములో సవతిపేరు పొరపాటున పలికిన పినాకిని కాను. ఇట్లు గర్వముగాను, కోపముగాను మాట్లాడుచున్న మహిషాసురుని అతి కఠినమైన కాలితో భద్రకాళి చంపెను. అట్టి భద్రకాళి మిమ్ము రక్షించుగాక!

అన్యోన్యాసంగగాఢవ్యతికరదళిత భ్రష్ట
కాపాలమాలాం
శంభో స్సంత్యజ్యసంఖ్యే ఖురపుటదళితప్రోల్ల
సద్ధూళిపాండుః
భద్రే! క్రీడాభిమర్దీ తవ సవిధ మహం కామతః
ప్రాప్తమీశో
ఽత్యేవం సోత్ప్రాస మవ్యా న్మహిషసురరిపుం
నిఘ్నతీ పార్వతీ వః॥

మన ముఖయులము పెనగినప్పుడు జారిపడిన కపాలమాలను నా కాళ్ళగిట్టలతో త్రొక్కినప్పుడు లేచిన ధూళితో తెల్లని శరీరము అనగా శివునివలె నున్నాను. కామించి నీ సమీపమునకు వచ్చి

నాను. అని యిట్లు ప్రల్లదములాడు మహిషాసురుని పార్వతి చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

జ్వాలాధారాకరాళం ధ్వనితకృతభయం
యం ప్రభేత్తుం న శక్తం
చక్రం విష్ణో ర్దృఢాశ్రి ప్రతివిహతరయం
దైత్యమాలావినాశి
క్ష్ణుణ్ణ స్తస్యాఽస్థిసారో విబుధరిపుపతేః
పాదపాతేన యస్యాః
రుద్రాణీ పాతు సా వః ప్రశమితసకలోపప్లవా
నిర్వ్యఘాతమ్॥

తా॥ అగ్నిజ్వాలలను చిమ్ముచూ భయంకరమై రాక్షస సమూహము లను సంహరించు విష్ణుచక్రము మహిషాసురుని భేదింపలేకపోయి వెనుకకుపోయెను సర్వ దుఃఖములను బాపునట్టి రుద్రాణి తన కాలితన్నుతో వాని యెముకలలోని సార మును సయితము పిప్పిపిప్పి చేసెను. అట్టి రుద్రాణి మిమ్ములను తప్పక రక్షించు గాక।

గాఢావష్టంభపాద ప్రబలభరనమత్పూర్వకాయోర్ధ్వ
భాగం
దైత్యం సంజాతశిక్షం జనమహిష మిహ
న్యక్కృతాగ్ర్యాంగభాగం
ఆరూఢా శూలపాణేః కృతవిబుధభయం
హంతుకామం సగర్వం
దేయా ద్వ శ్చింతితాని దృఢమహిషవధావాప్తతుష్టి
ర్భవానీ॥

తా॥ దేవతలకు భయము కొలిపెడి వాడున్నూ, గర్వియున్నూ, చంప సిద్ధముగా నున్నవాడున్నూ అయిన మహిషాసురుని తల వంగునట్లు కాలితో త్రొక్కి

త్రిశూలమును చేతిలోపట్టి భవాని అణచియుంచెను. అది యెట్లుండెననగా ఎక్కుటకు తలవంచుట అలవాటు చేయబడిన సాధారణపు మున్నవలె నుండెను. దేవి వెంటనే వాని సంహారించెను. అట్టి భవాని మీ చింతలను పోగొట్టుగాక!

బ్రహ్మా యోగైకతానో విరహభవభయా
ద్ధూర్జటి స్త్రీకృతాత్మా
వక్షశ్శార్ఙ్గరే ర్విశాలం ప్రణయకృతపదా
పద్మవా సాఽధిశేతే
యుద్ధక్ష్మా మేవ మేతే విజహతు ధి గిమం య
స్త్వజ త్యేష శక్రో
దృ ప్తం దైత్యేంద్ర మేవం సుధయతు సమదా
నిఘ్నతీ పార్వతీ వః॥

తా॥ బ్రహ్మ యోగసమాధిలో నిమగ్నుడయినాడు. శివుడు జడలు దాల్చి విరహభీతితో సగము ఆడదయ్యెను. ప్రేమతో సాధించి విష్ణు వక్షస్థలము నందు లక్ష్మి పరుండియున్నది. వారందరూ యుద్ధభూమిని వదలిపోవుట బాగానే యున్నది. ఛీ యింద్రా! నీవేల పారిపోవుచున్నావు. రాక్షసులలో యింద్రతుల్యుడయిన మహిషాసురు డిట్లు దేవతల నపహసించుచుండగా పార్వతి వానిని చంపెను. అట్టి పార్వతి మీకు సుఖముల నిచ్చుగాక!

ఏవం ముగ్ధే కిలాఽసీః కరకమలరుచా మా
ముహుః కేశపాశం
సోఽన్యస్త్రీణాం రతాదౌ కలహసముచితో యః
ప్రియే దోషలబ్ధే
వైదగ్ధ్యే దేవ మంతఃకలుషితవచనం
దుష్టదేవారినాథం
దేవీ వః పాతు పార్ష్ణ్యా దృఢతను మనుభి
ర్మోచయంతీ భవానీ॥

తా॥ ఓ చండీ! నీ కర కమలములతో యేల మాటిమాటికి నామీద (కేశ) పాశములను వైచెదవు. అన్యస్త్రీ రతుడయిన శివునిమీద ప్రణయకోపముతో వేయుట ఉచితము అని యీ రీతిని చమత్కారముగాను, దుష్టముగాను మాట్లాడు చున్న దృఢకాయుడయిన మహిషాసురుని భవాని కాలిమడమతో చంపెను. అట్టి భవాని మిమ్ము రక్షించుగాక.

బాలోZద్యాప్యేష జన్మా సమర ముడుపభృ
త్ప్రాంసులీలావిలాసీ
నాగాస్యో శ్యాతదంత స్స్వతనుకర ముదా
ద్విహ్వల స్సోZసి శాంతః
ధి గ్యాసి క్వేతి దుష్టం ముదితతనుముదం
దానవం సన్ప్రరోక్తం
పాయా ద్వ శ్శైలపుత్రీ మహిషతనుభృతం
నిఘ్నతీ వామపార్ష్ణ్యా॥

తా॥ కుమారిస్వామి తిరిగి యిప్పుడు బాలుడయ్యెను. యుద్ధమునకు పనికిరాడు. చంద్రధరుడయిన శివుడు మట్టితో ఆడుకొనుచు కాలము గడుపు చున్నాడు. తన నన్నని తుండమును చూచి మురిసిపోవుచూ గణపతి ఊరకున్నాడు కనుక అయ్యో యెక్కడికి పోవుచున్నావు. అని మదముతో రంకెలువేయుచు దుష్ట ముగా మాట్లాడుచున్న మహిషాసురుని పార్వతి యెడమకాలి మడమతో త్రొక్కి చంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

మూర్ధ్ని శ్యూలం మ మైత ద్విఫల మభిముఖం
శంకరోత్థాతశూలమ్
సంగ్రామా ద్దూర మేత ద్ధృత మరిహారిణా
మున్మనః కషణీవ
గర్వా దేవం క్షిపంతం విబుధజనవిభూన్
దైత్యసేనాధినాథమ్

శర్వాణీ పాతు యుష్మాన్ పదభరదళనా త్త్రాణితో
దూరయంతీ॥

తా॥ శంకరుడు త్రిశూలమును నామీద ప్రయోగించుట నిష్ఫలము. నా కది తలనొప్పిని మాత్రము కలుగచేయును. ఎక్కడో దూరమునుండి ప్రయోగించ బడినవిష్ణుచక్రము నా మనస్సు నాకర్షించునదై యున్నది. ఈ విధముగా దేవాధి నాధు ను తూలనాడుచున్న రాక్షస సేనానాధుడయిన మహిషాసురుని శర్వాణి కాలితో త్రొక్కి చంపెను. అట్టి శర్వాణి మిమ్ము రక్షించుగాక!

భ్రామ్యద్ధామౌర్వదాహక్షుభితజలచరవ్యస్తవీచీః
సకంపాః
కృత్వై వాZZశు ప్రసన్నాః పునరపి జలధీః
మందరక్షోభభాజః
దర్పా దాయాంత మేవ శ్రుతిపుటపరుషమ్ నాద
మభ్యుద్గిరంతం
కన్యాZద్రేః పాతు యుష్మాం శ్చరణభరనతం
పింషతీ దైత్యనాథమ్॥

తా॥ బడబాగ్ని జ్వాలల భయముచేత సముద్రములోని తిమింగలము మొదలయిన జలచరములు అటు యిటు యెగిరిపడుచు సముద్రమును సంక్షోభింప జేసెను. ఇట్లు మహిషాసురుడు శాంతమైన సముద్రమును మందరపర్వతము కలచి నట్లు కలచివైచెను. అంత గర్వితుడై చెవులు చిల్లులుపడు నట్లరచుచు వచ్చుచున్న మహిషాసురుని పార్వతి కాలితో త్రొక్కిచంపెను. అట్టి పార్వతి మిమ్ము రక్షించు గాక!

మైనా మిందోZభినైషి శ్రితపృథుశిఖరామ్
శృంగయుగ్మస్య పార్శ్వం
యుద్ధశ్మ్రయాం తనుం స్వాం రతిమదవిలసత్
స్త్రీకటాక్షక్షమేయం

ఘానో కిం వీక్షితేన క్షితిమహిషతనౌ త్వం హి
సంన్యస్తపాదో
దర్పా దేవం హసంతం వ్యసు మసుర ముమా
కుర్వతీ త్రాయతాం వః॥

తా॥ ఓ చంద్రుడా! పర్వతాగ్రము నాశ్రయించియుండు నీ శరీరమును నా కొమ్ముల దగ్గరకు రానియ్యకుము. నీవు యుద్ధమునకు తగవు. రతివిలాసముతో నుండు స్త్రీ కటాక్ష వీక్షణములకు మాత్రము తగుదువు.

ఓ సూర్యుడా! నీవేమి చేయగలవు? సామాన్యపు మహిషముమీద నీ కిరణములు ప్రసరించగలవు. నామీద నీ చేతగాదు. ఇట్లు గర్వించి మాట్లాడుచున్న మహిషాసురుని ఉమ చంపెను. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక!

న గ్రామా త్త్రస్త మేతం త్యజ నిజమహిషం
లోకజీవేశ మృత్యో
స్థాతుం శూలాగ్రభూమౌ గతభయ మజయం
మత్త మేతం గృహాణ
దైత్యే పాదేన యస్యా శ్ఛలమహిషతనౌ
శాయితే దీర్ఘనిద్రాం
ఘావోత్ప్రత్తౌజ యైవం హసతి పితృపతిం
సాఽంబికా వః పునాతు॥

తా॥ ఓ యమా! యుద్ధములో భయపడిన నీ దున్నపోతును విడువుము, శూలముతో పొడచినను భయపడక మదముతో ఉప్పొంగుచూ దుర్జయుడైన ఈ మహిషాసురుని తీసికొనుము. అంబికయొక్క కాలితో చంపబడి పడియున్న మహిషాసురుని చూచి సంతోషము పట్టలేక జయ యముని వెక్కిరించెను. అంబిక మిమ్ము రక్షించుగాక.

శ్రుత్వైతత్కర్మ భావా దనిభృతరభసం
స్థాణునాZభ్యేత్య దూరా
ల్లిప్తా బాహుప్రసారం శ్వసితభరచలత్తారకా
ధూతహస్తా
దైత్యే గీర్వాణశత్రౌ భువనసుఖముషి ప్రేషితే
ప్రేతకాష్ఠామ్
గౌరీ వోZవ్యాత్స్మలత్సు త్రిదివిషు త మలం
లజ్జయా వారయంతీ॥

తా॥ లోక సౌఖ్యమును ధ్వంసము చేసిన మహిషాసురుని సంహరించిన తరువాత ఆ వార్త విని శివుడు చేతులుచాచి పరిగెత్తుకొనివచ్చి అతితొందరగా కొంచెము వణకుచున్నట్టియు, ఆయాసముచేత కండ్లు త్రిప్పుచున్నట్టియు గౌరిని కౌగలింపచూచెను. దేవతలు చూచుచున్నందున సిగ్గుతో దేవి వారించెను. అట్టి గౌరి మిమ్ము రక్షించుగాక!

భద్రే స్థాణు స్తవాంఘ్రిః క్షతమహిషరణ
వ్యాజకండూతి రేషా
త్రైలోక్యక్షేమదాతా భువనభయహరః
శంకరోZతో హరోZపి
దేవానాం నాయికే త్వద్గుణకృతవచనోZతో
మహాదేవ ఏషా
కేళా వేవం స్మరారి ర్హసతి రిపువధే
యాం శివా పాతు సా వః॥

తా. ప్రియమైన చండీ! నీ పాదము నిజముగా స్థాణువు. అందుచేతనే మహిషాసురుని పోట్లాట యనెడి దురదను మాన్పెను. ముల్లోకములకు క్షేమమును కూర్చును గనుక నీ పాదము శంకరుడు లోకభయమును సంహరించును గనుక హరుడు ఓ దేవతలయొక్క నాయికా! నీ గొప్ప పాదముయొక్క ఆజ్ఞను శిరసా

వహించుటచే అది మహాదేవుడు మహిషాసుర సంహార సందర్భములో శివుడు ఈ విధముగా శివను మేలమాడెను. అట్టి శివ మిమ్ము రక్షించుగాక!

ఖడ్గః కృష్ణస్య నూనం రహితగుణగతి
రస్నందకాఖ్యాం ప్రయాతః
శత్రో ర్భంగేన వామ స్తవ ముదితసురో
నందక స్త్వేష పాదః
ఖావా దేవం జయాయాం నుతికృతి
నితరామ్ సన్నిధే దేవతానాం
సవ్రీడా భద్రకాళీ హతరిపు రవతా
ద్వీక్షితా శంభునా వః॥

తా॥ కృష్ణుని ఖడ్గము నందకము. అనగా ఆనందమిచ్చునది. కాని మహిషాసుర యుద్ధములో దాని కాగుణము లేకపోయెను. రాక్షసుని చంపి దేవతలకు సంతోషము చేకూర్చెను గాన దేవి యెడమపాదము నందకము. సంతోషము పట్టలేక దేవతల సన్నిధిలో జయ నుతి చేయుచుండగా సిగ్గుపడుతున్న భద్రకాళిని శివుడు కన్నారా చూచుచుండెను. అట్టి భద్రకాళి మిమ్ము రక్షించుగాక!

ఏకే నైవోద్గమేన ప్రవిలయ మసురం
ప్రాపయామీతి పాదో
యస్యాః కాంత్యా నఖానాం హసతి సురరిపుం
హంతు ముద్యన్ సగర్వం
విష్ణో స్త్రిః పాదపద్మం బలనియమవిధా
వుద్ధృతం కైతవేన
క్షిప్రం సా వో రిపూణాం వితరతు విపదం
పార్వతీ క్షుణ్ణశత్రుః॥

తా॥ "ఒక్కసారి కాలుయెత్తి యీ రాక్షసుని చంపెదను" అని దేవి పాదము నెత్తగా, ఆ పాదముకాంతి విష్ణుపాదమును వెక్కిరించుచున్నదా యన్న

టుండెను. బలిని చంపుటకు విష్ణువు మూడుపాదము లెత్తవలసి వచ్చెను. అప్పటికి వంచనచే జయించెను. మహిషాసురుని చంపిన పార్వతి యామె. అట్టి పార్వతి మీ శత్రువులను నాశనము చేయుగాక!

ఖడ్గం ఖట్వాంగయుక్తం యువతి రపి విభో
తే శరీరార్ధలీనా
హాస్యక ప్రాగేవ లబ్ధం సురజనసమితౌ
దుష్కృతేన త్వ యైవమ్
జాతా భూయోఽపి లజ్జా రణత ఇయ ములం
హాస్యతా శూలభర్త
ర్ద్రాప్రా దేవం హసంతం భవ మసుర ముమా
నిఘ్నతీ త్రాయతాం వః

తా॥ ఓ శివ! నీ ఖడ్గపుపిడి కపాలముతో చేయబడినది. నీ శరీరములో సగం స్త్రీయై యున్నది. దేవసభలో నీవు యిదివరకే నవ్వులపాలయితివి. నాతో యుద్ధము చేయుటలో తిరిగి సిగ్గు సంభవించినది. నీవు హాస్యాస్పదుడవగుటకు యిది యొకటిచాలు. ఇట్లు గర్వించి పలుకు మహిషాసురుని ఉమ చంపెను. అట్టి ఉమ మిమ్ము రక్షించుగాక!

స్థాణౌ కండూ వినోదో నుదతి దినకృత
స్తేజసా తాపితం నో
తోయస్థానే న చాఽస్తం సుఖమధికతరం
గాహనే నాఽంగజాతం
శూన్యాయాం యుద్ధభూమౌ వదతి హి
ధిగిదం మాహిషం రూపమేవం
రుద్రాణ్యాఽఽరోపితో వః సుఖయతు
మహిషే ప్రాణహృత్ పాదపద్మః॥

తా॥ స్థాణువు (శివుడు)ను రాచుకొనుటవల్ల నా దురద తీరుటలేదు.

సూర్యుని కిరణములచేత నా శరీరము వేడెక్కుటలేదు. వరుణలోకములో (నీళ్ళలో) దుమికినా సౌఖ్యము లేకున్నది. ఈ దున్నపోతు ఆకారమెందుకు? అందరూ భయపడి పారిపోయిన యుద్ధభూమిలో మహిషాసురుడెట్లు మాట్లాడుచుండగా రుద్రాణి పాదపద్మము వానిపై పెట్టి చంపెను. అట్టి రుద్రాణి పాదపద్మము మీకు శుభముల నిచ్చుగాక!

పింషం ప్రైచ్ఛేంద్రకల్పం మహిష మతిగురు
 ర్భగ్న గీర్వాణగర్వం
శంభో ర్జాతో లఘీయా న్ల్రమరహితవప్పు ర్దూర
 మభ్యూహ్య పాతః
వామో దేవారిప్పృష్ఠే కనకగిరిపదం
 క్షేమకారోంఘ్రిపద్మో
యస్యా దుర్వార ఏవం వివిధగుణగతి
 స్సాZవతా దంబికా వః॥

తా॥ మేరుపర్వత వాసులయిన దేవతలకు శుభముల నిచ్చునదియు, దేవతల విరోధియైన మహిషుని వీపునకు విరోధియునయిన అంబికయొక్క దుర్వారమైన యెడమ పాదమునకు వివిధ గుణములు కలవు, పర్వతములలో యింద్రుడనదగిన హిమవంతునితో పోల్చదగినట్టియు, దేవతల గర్వమడచునట్టియు మహిషాసురుని చంపుటకు వీలుగా బరువెక్కినదయ్యుండెను. అట్లుండియు దూరమునుండియే తాపు తగులుటకు వీలైయుండ, శ్రమరహితమై శివుని (పాదము) కంటె తేలికగా కూడా నుండెను. అట్టి అంబిక మిమ్ము రక్షించుగాక!

మార్గం శీతాంశుభాజమ్ సరభస మలఘుమ్ హంతు
 ముద్యన్నురారిమ్
నేత్రై స్త్రిభిర్విభ్రాంత తారై స్స చకిత మమరై
 రున్ముఖై ర్వీక్ష్యమాణః
యస్యా వామో మహీయా న్ముదిత
 సురమనాః ప్రాణ హృత్పాద పద్మః

ప్రోత్తప్త స్సన్మూర్ధసీమామ్ సుఖయతు
భవత స్సా భవానీ హతారిః॥

తా॥ భవాని మహిషాసురుని చంపుటకు ఎడమపాదమును అతివేగ ముతో నెత్తగా చంద్రమండలము నంటెను. కన్నులనువిప్పి ఆశ్చర్యముతో దేవతలు తలలెత్తి చూచిరి. దేవతలకు సంతోషమును కల్పించు పాదమును మహిషాసురుని చంపిన తరువాత దేవి వాని నెత్తిపై నుంచెను. అట్టి భవాని మీకు సౌఖ్యముల నిచ్చుగాక!

మూర్ధ న్యాపాతభగ్నే మిషమహిషతను
స్సన్నినిశ్శబ్దకంఠః
శోణాబ్జాతస్య కాంతి ప్రతతఘనతృహన్మండలే
పాదపద్మే
యస్యా లేభే సురారి ర్మధురసనిభృతత్వాదశార్ధాం
ప్రఫిలీలాం
శర్వాణీ పాతు సా వ స్త్రిభువనభయహృ
త్స్వర్గిభి స్తూయమానా॥

తా॥ దేవి పాదముక్రింద నలిగిచచ్చిన మహిషాసురుడు మెడ వాలిపోయి గొంతుకలో శబ్దము లేకుండెను. వాడు శర్వాణి పాదపద్మములపై పడియుండగా యెఱ్ఱనికాంతి వానిపై క్రమ్మెను. వాడు మధువుతో కప్పబడి నిశ్చలముగా నున్న తుమ్మెదవలె నుండెను. మూడులోకముల భయమును చాటినట్టియు, దేవతలచే స్తుతించబడునట్టియు మిమ్ము రక్షించుగాక!

పాదోత్క్షేపా ద్వ్యఃదిప్ర ర్నఖకిరణశతై
శ్చంద్రగౌరై
ర్మూర్ధాగ్రే చాZZపతద్భి శ్చరణతలశతై
రంభి శ్శోణశోభః

సంన్యస్తాలీనరత్న ప్రవిరచితకరై శ్చర్చితః
క్షి ప్తకాయై
ర్యస్యాం దైవైః ప్రణీతో హవిరివ మహిష
స్సాZవతా దంబికా వః॥

తా॥ దేవతలు వంగిన దేహములతో మహిషాసురుని నైవేద్యముగా అంబిక వద్దకు తెచ్చిరి. వారి పదనఖ కాంతులతో చంద్రునివలె తెల్లగను, మీగాళ్ళ యెరుపు ప్రసరించి ఎర్రగాను. వారు ధరించిన కిరీటములలోని మణుల కాంతుల తోనూ వాని తల అలంకరించబడి యుండెను. అట్టి అంబిక మిమ్ము రక్షించుగాక!

క్వాZయం తీక్ష్ణాగ్రధారాశతనిశితవపు
ర్వజ్రరూప స్సురారిః
పాద శ్చాయం సరోజద్యుతి రణతిగురు
ర్యోషితః క్వేతి దేవ్యాః
ధ్యాయంధ్యాయం స్తుతో య స్సురరిపుమథనే
విస్మయాబద్ధచిత్తైః
పార్వత్యా స్సోZవతా ద్వ స్త్రిభువనగురుభి
స్సాదరం వంద్యమానః॥

తా॥ వజ్రాయుధపు వాడియైన అంచులవలె తీక్షణమై కఠినమయిన మహిషాసురుని దేహమెక్కడ బరువులేనిదియు, పద్మముతో సమానమైనదియునగు దేవి పాదమెక్కడ యని పార్వతీదేవి పాదముకు మాటిమాటికి మూడులోకము మహర్షులు ధ్యానముచే స్తుతించిరి. మహిషాసురుని చంపినందుకు వారి మనసులు విస్మయము చెందెను. అట్టి పార్వతీదేవి పాదము మిమ్ము రక్షించుగాక!

వజ్రిత్వం వజ్రపాణే ర్ద్యుతితనయభిద శ్చక్రిణ
శ్చక్రకృత్యం
శూలిత్వం శూలభర్తు స్సురకటకవిభో
శ్శక్తితా షణ్ముఖస్య

యస్యాః పాదేన సర్వం కృత మమరరిపో
ర్బాధ యైత త్సురాణామ్
రుద్రాణీ పాతు సా వో దనువిఫలయుధామ్
స్వర్గిణాం క్షేమకారీ॥

తా॥ ఇంద్రునియొక్క వజ్రత్వము (వజ్రము కలిగియుండుట) చక్ర పాణి యొక్క చక్రకృత్యము (చక్రము కలిగియుండుట) శివునియొక్క శూలిత్వము, కుమారస్వామి శక్తితా (శక్తిని కలిగియుంచును) ఇవియన్నియు రుద్రాణి పాదము కలిగియుండి, దేవి విరోధియైన మహిషాసురుని చంపి వానిని జయించలేక పోయిన దేవతలకు సౌఖ్యము చేకూర్చెను. అట్టి రుద్రాణి మిమ్ము రక్షించుగాక।

పంగు ర్యేన్తా హరీణా మసమహరియుత
స్స్యందన శ్చైకచక్రో
భానో ప్సామగ్ర్యపేతః కృత ఇతి విధినా
త్యక్తవైరః పతంగే
దర్పా ద్వ్యామ్యా రణజ్ఞం ప్రతిభటసమరాశ్లేషలుబ్ధ
స్సురారిః
యస్యాః పాదేన నీతః పితృపతిసదనం సాZవతా
దంబికా వః॥

తా॥ 'పతంగుని (సూర్యుడు) రధసారధి కుంటివాడు. పనికిరాని గుర్రములు. అసమ సంఖ్యయైన యేడుగుర్రములు గలవాడు, రథమునకు ఒకటే చక్రము. ఇట్టి విరోధిమీదకు పోవుట రణధర్మముకాదు' అని నిర్లక్ష్యముగా మాట్లాడుచూ యుద్ధభూమిలో విర్రవీగి తిరుగుచున్న మహిషాసురుని యమలోకమునకు అంబిక పాదము చంపెను. అట్టి అంబికపాదము మిమ్ము రక్షించుగాక!

యుక్తంతాప ద్గజానాం ప్రతిదిశ మయనం
యుద్ధభూమే ర్దిగీశామ్

హేమే తాఽఽగాగజత్వం సుభదరణకృతాం
కర్మణా దారుణేన
యద్వేషా స్థాణుసంక్షో భయచకితదృశా
నశ్యతీ త్యద్భుతం త
ద్దృష్ట్వా దేవం హసంతం సురరిపు మవతా
న్నిఘ్నతీ పార్వతీ వః॥

తా॥ నాతో యుద్ధము చేయలేక దిగ్గజములు వాటివాటి దిక్కులకు పారి పోవుట యుక్తమే. నాతో యుద్ధముచేసి చచ్చినచో ఆ దిక్కులను రక్షించుట యెట్లు? కాని స్థాణువు (రాతిబండ) భయముతో వణకుచు పారిపోవుట కడు ఆశ్చర్యము అని మహిషాసురుడు శివుని అపహసించుచుండగా, పార్వతి వానిని చంపెను అట్టి పార్వతి మిమ్ము రక్షించుగాక!

ప్రనష్టాంగ స్సన్నచేతో భయహతవచన
స్సన్న దోర్దండశాఖః
స్థాణు ర్దృష్ట్వా య మాజౌ క్షణ మివ
సరుషం స్థాణు రేవోపజాతః
తస్యోద్ధ్వంసా త్స్వరాదే ర్మహిషితవపుషో
లబ్ధమానావకాశః
పార్వత్యా వామపాద శ్శమయతు దురితం
దారుణం వ స్సదైవ॥

తా॥ శివుడు పరాక్రమశాలియైన మహిషాసురుని యుద్ధభూమిలో చూచినంతనే అవయవములు దుర్బలములై, ఏమియు చెయలేనివాడై భయముతో మాటపోయి, గట్టిచేతులు ఎప్పటివలె స్థాణువయ్యెను. కీర్తి సంపాదించుట కిది సమయమని పార్వతి మహిషాసురుని యెడమకాలితో చంపెను. అట్టి పార్వతి యెడమ పాదము మీ కెల్లప్పుడూ దఃఖము పోగొట్టునది యగుగాక!

కుంతే దంతై ర్నిరుద్ధే ధనుషి విముఖితే జ్యా
విషాణేన మూలా
ల్లాంగూలేన ప్రకోష్ఠే వనయిని పతితే తత్కృపాణే
స్వపాణేః
శూలే లోలాంఘ్రిపాతై ర్గళితకరతలా
త్ప్రచ్యుతే దూర ముర్వ్యామ్
సర్వాంగీణం లులాయం జయతి చరణత
శ్చండికా మార్దయంతీ॥

తా. దేవియొక్క అంకుశము - శూలము మహిషుడు పండ్లతో పట్టుకొని, ధనుస్సుయొక్క త్రాడును కొమ్ములతో ఊడదీసి, ఆమె చేయి తోకతో చుట్టి, చేతినుండి కత్తి పడవేసి, కాళ్ళ త్రొక్కుడిచే త్రిశూలము చేతులనుండి పోయి దూరమున పడినప్పుడు చండిక తనను క్రమ్ముకొనుచూ వచ్చుచున్న మహిషాసురుని కాలితో చంపెను. అట్టి చండికకు జయము కలుగుగాక!

